శ్రీ విఖనసగ్రంథమండలి అష్టమ కుసుమము.

వేదపురుషాయనమః

# అష్టాదశ కల్పసూత్ర సమీక్ష

## ప్రథమ సంపుటము - ప్రథమ భాగము

## ఆశ్వలాయన, కౌషీతకి గృహ్యసూత్రములు

(ఋగ్వేదీయములు.)



పర్యవేక్షకులు :

వైయాకరణపంచానన
రొంపిచర్ల పార్థసారథి అయ్యంగారు

బాలవ్యాస
వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

సమీక్షకులు :

సాహిత్యవిద్యాప్రవీణ
ముళ్ళపూడి నారాయణశాస్త్రి

వ్యాకరణవిద్యాప్రవీణ - భాషాప్రవీణ
పరాశరం వేంకట కృష్ణమాచార్యులు

రచయిత :

పరాశరం వేంకటకృష్ణమాచార్యులు

1959.

శ్రీ విఖనసగ్రంథమండలి అష్టమ కుసుమము.

వేదపురుషాయనమః

# అష్టాదశ కల్పసూత్ర సమీక్ష

ప్రథమ సంపుటము - ప్రథమ భాగము

## ఆశ్వలాయన, కౌషీతకి గృహ్యసూత్రములు

(ఋగ్వేదీయములు.)

పర్యవేక్షకులు :

వైయాకరణపంచానన
రొంపిచర్ల పార్థసారథి అయ్యంగారు

బాలవ్యాస
వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

సమీక్షకులు :

సాహిత్యవిద్యాప్రవీణ
ముళ్ళపూడి నారాయణశాస్త్రి

వ్యాకరణవిద్యాప్రవీణ - భాషాప్రవీణ
పరాశరం వేంకట కృష్ణమాచార్యులు

రచయిత :

పరాశరం వేంకటకృష్ణమాచార్యులు

శ్రీ విఖనస గ్రంథమండలి
పొన్నూరు

1959.

# ఒక మాట

ఆర్య సంస్కృతి నుద్ధరింప వలయునని విఖనస గ్రంథమండలి మాకాంక్ష. అందుకు తగిన గ్రంథముద్రణ కొనసాగించుటకు మండలి కుతూహల పడుచున్నది. తత్ఫలితముగా నీయష్టాదశ కల్పసూత్ర సమీక్షా కార్యక్రమమును సంకల్పించినది. ఈ కార్యక్రమము కష్టసాధ్యము వ్యయప్రయాసలతో కూడినపని యయినను సమర్థులగు పర్యవేక్షకులను సమీక్షకులను రచయితలను ప్రసన్నము చేసికొని సహృదయముతో మండలి తన సత్కార్యమును సాధింపదలచినది. ఋగ్వేదీయములగు నాశ్వలాయన కౌషీతకి (సాంఖ్యాయన) గృహ్యసూత్రసమీక్ష ప్రథమ సంపుటములోని ప్రథమభాగముగ ఈశుభ సమయములో మీ యెదుట సాక్షాత్కరించు చున్నది. మీ యాదరణతో తరువాతి సంపుటములు సక్రమముగా వెలువడును. ఈ భగీరథ ప్రయత్నములో సంపూర్ణ సహకారమిచ్చిన సహృదయులందరికిని మాధన్యవాదములు. మా సంయుక్త కార్యదర్శి పండిత, పరాశరం వేంకట కృష్ణమాచార్యులు సమీక్షకులు రచయితయు నగుట మండలికిని మాకును గర్వించదగిన విషయము. ఈ యపూర్వకృషికి మా మండలి యాలవాలమగుట మాకు ముదావహము. మా ప్రయత్నమును సార్థకపరచి సాదరముగ మా సంపుటముల నందుకొని పాఠకులు ఆర్యసంస్కృతిని పునరుద్ధరింతురు గాత.

పొన్నూరు
5—7—59

ఇట్లు
D. V. A. ఆచార్య
(ప్రధాన కార్యదర్శి)

# పాఠకులకు

ఈ సమీక్షా రచనయందు పదసౌందర్యము నపేక్షించి కొన్నియెడల తద్ధర్మార్థక క్రియాపదములు, కొన్నియెడల విధ్యర్థక క్రియాపదములు నుపయోగింపబడినవి. మూలసూత్రరచనా పద్ధతియు నీరీతిగా నుండును. కావున మూలమునందువలెనే యిచటను క్రియాపదములన్నెల్ల విధ్యర్థకములుగనే భావించునది, మాకు వ్యవధి లేనందునను, అరసున్నలు, శకటరేఫన్యాయము, మున్నగునవి యీ ముద్రణమున సమకూర్చుటకు సాధ్యము కాలేదు.

రచయిత.

# ఉపోద్ఘాతము

శ్రీ శివాయ గురవేనమః

నమోస్తు శౌనకాదిభ్యస్సూత్రకృద్భ్యో ముహుర్ముహుః
యేషామనుగ్రహాత్ప్రాప్తం గృహ్యసూత్రస్యయేక్షణమ్॥

సహృదయులకొక మనవి:— విఖనస గ్రంథమండలి తలపెట్టిన కల్పసూత్ర సమీక్షా కార్యక్రమమున మొదటి ప్రయత్నము ఈ గ్రంథము. దీనియందు మాకాదర మున్నంతగా శక్తిలేదు. అయినను పెద్దల యాశీర్బలమున నేటికో యొక గట్టునకు జేరితిమి. ఇందు మేమనుసరించిన విధాన మొక్కింత సూచింతుము.

గృహ్యసూత్రములన్నియు నొకరీతిగా నడచినవి. అవి ప్రయోగ క్రమాను సారముగ కూర్చబడి యుండలేదు. ప్రతిసూత్రసంప్రదాయానుసారులును ప్రయోగ ములను మరొకరీతిగా రూపొందించుకొని తత్తత్కర్మల నాచరింతురు. అందులకు సూత్ర ములుపయోగించును. కాన మేమీ సమీక్షలో గృహ్యసూత్రకర్త లందించిన మం త్రములను గ్రంథగౌరవభీతిచే బేర్కొనక సామాన్యమగు ప్రక్రియను మాత్రము చూపుచు కర్మస్వరూపము మాత్రము పాఠకులకు విదితమగునట్లు జేయ ప్రయత్నించి తిమి. సంజ్ఞాపరిభాషా పదములకు ప్రత్యేకముగా వివరణము ననుబంధ రూపముగా నివ్వ నెంచి యిట వివరింపలేదు, సమీక్షయందలి యన్నిటికన్న మిన్నయై విపులమైన సింహా వలోకనము రాగలదు. ఇందు ప్రయుక్తములగు మంత్రముల నెఱుగగోరువారు తత్త చ్ఛాఖోపయుక్తములగు ప్రయోగ గ్రంథములు చూడనగును.

ఇయ్యది ప్రధానముగా మన గృహ్యసూత్రమున నేయే కర్మల నేయే రీతిగా మహర్షులు వేదరాశి మథించి మనకు బోధించిరో సూక్ష్మముగా నెఱుగుట కుపయోగించును. దానిచే నా మహర్షుల వాక్యములందు శ్రద్ధ కలిగి క్రమముగా కర్మ శ్రద్ధాబద్ధమానసులయి కర్మల నాచరించి యాత్మదేహక్షేమము సంపాదింతురని సమీ క్షకులముగాని గ్రంథమండలివారుగాని ఆశించితిమి.

అందుచే మేము కొన్ని భాగములు తు. చ. తప్పకుండగను కొన్ని యెడల వ్యాఖ్యనుసూచించియు, భావము విశదము చేయుచును సమీక్షను కొనసాగించితిమి. ఇది గ్రహించి పాఠకలోకము మా కృషిని సార్థకము చేయుదురని విశ్వసించుచున్నాము.

సమీక్షకులు,

ముళ్ళపూడి నారాయణశాస్త్రి,

పరాశరం వేంకట కృష్ణమాచార్యులు.

పొన్నూరు
5—7—1959

వేదపురుషాయ నమః

# ఆశ్వలాయన గృహ్యసూత్రసమీక్ష

## ప్రథమాధ్యాయము

౧

అనేకాగ్నిసాధ్యములగు కర్మలు శ్రౌతసూత్రమున నిరూపింపఁబడినవి. ఇందు గృహ్యకర్మలు విశదీకరింపఁబడును. గృహ్యమనఁగా గృహనిమిత్తాగ్ని. గృహమనగా భార్య, శాల. "స్వగృహో గృహమాగతః" అను వాక్యమందా రెండర్థములు గోచరించుచున్నవి. దాయ విభాగకాలమందేర్పడునది శాలాగ్ని. వివాహమున నేర్పడునది భార్యాగ్ని. గృహపదవాచ్యమగు నీరెండగ్నులందు నిర్వర్తింపఁబడుకర్మలు గృహ్యములగుచున్నవి. గృహ్యములు పాకయజ్ఞము లనఁబడును. పాకశబ్దమునకుఁ "ప్రశస్తము," "అల్పము" అని యర్థము. కావున "ప్రశస్తయజ్ఞములు" "అల్పయజ్ఞముల"ని పాకయజ్ఞములు వ్యవహరింపఁదగు. ఏకాగ్నిసాధ్యములగుటచే నల్పయజ్ఞములు, బ్రాహ్మణ్యాపాదకములగు గర్భాధానాది సంస్కారములిందు నిర్వర్తింపఁ బడుటచే ప్రశస్తయజ్ఞములగుచున్నవి. ఇవి హుతములు, ప్రహుతములు, బ్రాహ్మణిహుతము, లని త్రివిధములు. అందగ్నియందు హోమము చేయఁదగినవి హుతములు, అనగ్నియందు నిర్వర్తింపఁబడు బలిహరణము మున్నగునవి ప్రహుతములు, బ్రాహ్మణ భోజనవిధి గలవి బ్రహ్మణిహుతములు.

౨

వైశ్వదేవము యజ్ఞత్రయాత్మకము. అందు దేవయజ్ఞమున నగ్ని మున్నగు నగ్నిహోత్రదేవతల నుద్దేశించి సాయంప్రాతః సమయములందు పక్వమైన హవిష్యముచే పదియాహుతులు వేయుదురు. భూతయజ్ఞమున స్వాహాకారాంతమంత్రములతో బలిని వేయుదురు. ఈబలులన్నిటికి నుత్తరమున రాక్షసులకు బలివేయవలయును. ఇక పిత్రు యజ్ఞమున ప్రాచీనావీతియై స్వధావచనముతో పూర్వోక్తబలులకు దక్షిణభాగమున

బలివేయవలయును. ఈవైశ్వదేవమునకు ప్రాతఃకాల మారంభమగును. మఱియు నిది యే యగ్నియందైనను జేయనగును. గృహ్యాగ్నియందే యను నియమము లేదు.

3

హోమము చేయఁదలచినవారు శాస్త్రప్రమాణమునకు దక్కువగానిరీతి స్థండిలమును గోమయముతోఁ జతురస్రముగా నలికందు వహ్నినుంచుప్రదేశమునకుఁ బశ్చిమమున దక్షిణమునుండి యుత్తరాంతముగా నొకరేఖ, దానికిరువైపులఁ దాకియుండునట్లు ప్రాగంతములుగ రెండు, అట్లే మధ్య మూడురేఖలు లిఖించి ఆరేఖలు కలియునట్లు వానిపై నగ్ని నుంచవలయు. ఈరేఖ లొకయజ్ఞీయశకలముచే రచింపుదురు. పిమ్మట నాశకలము నందేయుంచి స్థండిలము నభ్యుక్షణముచేసి శకలమును తొలగించి యుదకమును స్పృశించి తమకెదురుగా నగ్నిని నిలిపి రెండు మూడు సమిధల నుంచి పరిసమూహనము, పరిస్తరణము సమంత్రకముగాఁ బర్యుక్షణము గావించుదురు. ఇధ్మనాఁబడు పదునైదు సమిధలను బర్హిస్సులనాఁబడు యజ్ఞీయ పాత్రాసాదనార్థమైన దర్భలను నొకకట్టగా గట్టి యుంచుదురు. పవిత్రద్వయముచే నాజ్యము నుత్పవనము చేయుదురు. ఆజ్యమాత్ర హవిష్యములగు హోమములందుఁ బరిస్తరణము వికల్పము. పాకయజ్ఞములందంతట నాజ్యభాగములు, బ్రహ్మ వికల్పము. కాని ధన్వంతరి యజ్ఞ, శూలగవము లందు బ్రహ్మ నియతముగా నుండును. నామధేయముచేతఁ గాని మంత్రముచేతఁ గాని హోమనిర్దేశము లేనపుడు "అముష్మైస్వాహా" అని హోమము కర్తవ్యము. స్వశాస్త్రమునందు కర్మమాత్రనిర్దేశ ముండి పరశాస్త్రమున హోమవిధి దృష్టమైనపుడు "అగ్ని, ఇంద్రుడు, ప్రజాపతి, విశ్వేదేవులు, బ్రహ్మ" అను దేవతల నుద్దేశించి హోమము చేయఁదగు, ఏకకాలప్రాప్తములగు పాకయజ్ఞము లనేకదేవతాకములైనను నేకాజ్యములు, ఏకబర్హిస్సులు, ఏకస్విష్టకృత్తులుగా నొనరించుదురు.

4

ఉత్తరాయణ శుక్లపక్ష శుభనక్షత్రములందు చౌలకర్మ, ఉపనయనము, సమావర్తనము, వివాహము చేయఁదగినవి. కొందఱీ నియమము వివాహమునకు లేదందురు.

5

వధూవర పరీక్షయందు గుణములకంటెఁ బ్రధానమైన కులమును బరిశీలించవలయు. వారి మాతృపితృవంశములు మహాపాతకాది రహితములు, నపస్మారాది దోషరహితములును గావలయు. కన్య బుద్ధిమంతుడైనవాని కియ్యఁదగు. బుద్ధి రూప శీల

లక్షణవతి రోగరహితయగు కన్య స్వీకరింపఁదగినది. లక్షణములు సులభగ్రాహ్యములు కావుకనుక పరీక్షాంతర మొనర్పనగు. సంవత్సరమున రెండు పంటలు పండు క్షేత్రము, గోశాల, యజ్ఞమొనర్పఁబడిన వేదిక, సలిల సంపూర్ణహ్రదము, ద్యూతస్థలము, చతుష్పథము, ఊషరభూమి, శ్మశానము, ఈయెనిమిది ప్రదేశముల నుండి మృత్పిండములను దెచ్చి వాని నభిమంత్రించి వానిలో నొకదానిని గ్రహింపు మని కన్యను గోరవలయు. ఆపిండగ్రహణమున దత్తత్ప్రదేశములఁబట్టి కన్యాగుణ నిర్ణయము చేయదఁగు. మొదటి దానివలన సస్యసమృద్ధిగల ప్రజ గలది, రెండవ దానివలన బశువులు గలది, మూడవ దానివలన బ్రహ్మవర్చస్విని, నాల్గవదానివలన సర్వసంపన్న, అయిదవ దానివలన ద్యూతకరి, ఆఱవ దానివలన స్వైరిణి, ఏడవ దానివలన నధన్య, ఎనిమిదవ దానివలన బతిఘ్ని, యని గుర్తింపనగు. తుది మూడుఫలములు నింద్యములు.

౬

వివాహము లష్టవిధములు. కన్య నలంకరించి యుదకపూర్వకముగ నిచ్చినచో బ్రాహ్మవివాహము. ఈకన్యయందుదయించిన కుమారుడు మాతృపితృ వంశములందుఁ బూర్వోత్తరములందుఁ బండ్రెండు తరములం బవిత్రము గావించును. కన్య నలంకరించి యజ్ఞకర్మలందు ఋత్విజునకు దానమిచ్చిన నయ్యది దైవము. ఈవధువున కుదయించిన పుత్రుడు పూర్వోత్తరములందుఁ బది తరములవారినిఁ బూత మొనర్చు, "సహధర్మం చరత" యని కన్య నిచ్చిన నయ్యది ప్రాజాపత్యము. ఈమెయం దుత్పన్నమైనవాఁడు పూర్వోత్తరములం దెనిమిది తరములవారిని బవిత్రము గావించును. గోమిథున మిచ్చి కన్యను గ్రహించిన నది యార్షము. ఈమెయందుఁ బుట్టినవాడు పూర్వోత్తరములం దేడు తరములను బరిశుద్ధము గావించును. వధూవరులన్యోన్య మంగీకరించి ప్రతిజ్ఞాపూర్వకముగా వివాహమాడిన నది గాంధర్వము. ధనముచే గన్యాదాతను తృప్తి నొందించి కన్యను గ్రహించిన నది యాసురము, బంధువులు నిద్రించుచుండగ గాని ప్రమత్తులుగ నున్నపుడుగాని కన్య నపహరించి వివాహమాడిన నది పైశాచము యుద్ధ మొనర్చి కన్య నపహరించి వివాహమాడిననది రాక్షసము. ఇందు మొదటి నాల్గింటిలో పూర్వపూర్వము ప్రశస్తము తరువాతి నాల్గింటిలో నుత్తరోత్తరము నింద్యము. బ్రాహ్మము దైవము బ్రాహ్మణోచితములు, పురాణములంబట్టి

గాంధర్వము, యుద్ధప్రసక్తిచే రాక్షసము, క్షత్రియోచితములు. ధనప్రసక్తిచే నాసుర ము వైశ్యుల కుచితము. ప్రాజాపత్యము ఆర్షము, పైశాచము ననియతములు.

౭

నానావిధము లగు దేశధర్మములు గ్రామధర్మములు కులధర్మములు వివాహములందు బరిగ్రహింపదగు. అందు స్వగృహ్యోక్త ధర్మవిరుద్ధములు పరిహరింపనగు ప్రతిష్ఠించిన వహ్నికి బశ్చిమ భాగమున రెండు పాషాణముల నుంచుదురు. అందొకటి. పెద్దది రెండవది చిన్నది. ఈశాన్యభాగమున నుదకుంభము నుంచుదురు. వధువు తనను దాకియుండగా వరుడు ఆజ్యాహుతి పర్యంతము హోమముచేసి ప్రాఙ్ముఖముగా నాసీనయైన కన్యముందుఁ బశ్చిమాభిముఖుడై నిలిచి మంత్ర ముచ్చరించుచు పురుషసంతానార్థి యగుచో నామెహస్తాంగుష్ఠమునే గ్రహింపవలయు. స్త్రీసంతానార్థి యగుచో నంగుష్ఠమును వర్జించి నాలుగు వ్రేళ్ళను, ఉభయ సంతానార్థి యగుచో నైదువ్రేళ్ళను గ్రహింపవలయు పిమ్మట నుదకుంభము కలసి వచ్చునట్లు వధువును వహ్నికి ముమ్మారు ప్రదక్షిణము చేయించును. ప్రదక్షిణము లగువరకు వరుడొక మంత్రమును జపించును. ప్రతి ప్రదక్షిణమునకు ముందు మన్త్రాంతర ముచ్చరించుచు లాజాహుతి చేయించి పశ్చిమమునందుంచిన పాషాణమును వధువుచే ద్రొక్కించును. మూడవ ప్రదక్షిణాంతమున నశ్మారోహణమైన యనంతరము నొక లాజాహుతి చేయించును. ఈ లాజలను కన్యాసోదరుడుగాని తత్తుల్యుడుగాని కన్యదోసిట నుంచును. నాల్గవ యాహుతి మాత్రము కన్యయే శూర్పకోణ ముఖముననగ్నియం దుంచును పిమ్మట. కన్య స్వదేశాచారము ననుసరించి రెండు శిఖలనుకట్టి యుండిన నందు దక్షిణోత్తర శిఖలను క్రమముగా విప్పును. పిమ్మట నీశాన భాగమున వధువును నేడడుగులు ఏడుమంత్రము లుచ్చరించుచు నేలపై వేయించును. తదనంతర మాచార్యుడు వారిని సమీపించి నచటి యుదకుంభజలముచే వారి శిరములను కలిపి యవసేచనము చేసి యంతహోమము చేయును. వివాహము వరునకుఁ బరగ్రామమైనయెడల నా రాత్రి వరుడు, సుమంగల, పతి పుత్రవతియు నగు వృద్ధ బ్రాహ్మణి యింట వసియింపనగు. వధువు ధ్రువారుంధతీ సప్తఋషి దర్శన పర్యంతము మౌనము దాల్చియుండును. ధ్రువాది దర్శనా నంతరము వీడును.

౮

వివాహహోమ మయిన పిమ్మట వరుడు వధువుం గూడి స్వగృహమున

కేగును. వధువు బంధువులను వీడు నపుడు దుఃఖించిన నొకమంత్రమును జపింతురు. వివాహాగ్నిని ప్రత్యక్షముగా ముందుంచుకొని పోవును. వరుని గృహము గ్రామాంతర మందున్నపుడు ప్రయాణమున రథాది వాహనము సంభవించిన నదు వధువును మంత్రము నుచ్చరించుచు నెక్కింతురు. నదిని దాటవలసినపుడు నావ నెక్కించునపు డొకమంత్రము దించునపుడొకమంత్రమును బఠింతురు. దారిలో ప్రతివసతియందు జూపరులు వచ్చినపుడు వారికి సమంత్రకముగాఁ జూపింతురు. మంత్రమును బఠించుచు వధువును వరునిగృహమందుఁ బ్రవేశపెట్టుదురు.

వరుడు వివాహాగ్నిని సమిధలచేఁ బ్రజ్వలింపఁజేసి యగ్నికిఁ బశ్చిమ భాగమున బలీవర్ద చర్మమును ప్రాగ్గ్రీవముగాఁ బఱచి దానిపై వధువు నాసీనం గావించును. అగ్ని యందు నాల్గాహుతులను వేసిన పిమ్మట దధిలోఁ గొంతభాగమును సమంత్రకముగాఁ దాను పుచ్చుకొని శేషమును వధువుచేఁ బ్రాశనము చేయించును. ఈ వధూప్రాశనమున మంత్రము లేదు. లేక వరప్రాశనమంత్రముచే నాజ్యశేషము నుభయుల హృదయ దేశమునఁ దాకించును. పిమ్మట నంతహోమము. వివాహ గృహప్రవేశనీయ హోమ ద్వయముచే వివాహాగ్ని గార్హ్యాగ్ని యగును. వధూవరులు వివాహమైనది మొదలు క్షార లవణముల భుజింపక నాలంకృతులై నేలపై శయనించుచు బ్రహ్మచర్యముతో నుండ వలయు. ఈ నియమము గృహప్రవేశనీయ హోమానంతరము త్రిరాత్రి పర్యంతము లేక ద్వాదశరాత్రి పర్యంతము లేక సంవత్సర పర్యంతము నవలంబింతురు. ఈ వ్రతానంతరమే వధువు పితృగోత్రము వీడి పతిగోత్రము ప్రవేశించునందురు. సంవత్సర బ్రహ్మచర్య ఫలముగా ఋషికల్పుడగు పుత్రుడు పుట్టునందురు.

వ్రతానంతరము వివాహ సమయమున వధువు ధరించిన వస్త్రము నుతికించి శుభ్రపరచి దానిని సూర్యాసూక్త వేత్త యగు బ్రాహ్మణునకు వరుడొసంగును. తదుపరి బ్రాహ్మణ భోజనము. స్వస్తివాచనము.

౬

పాణిగ్రహణము మొదలు గృహ్యాగ్నిని యజమానుడు గాని పత్ని, పుత్రుడు, పుత్రిక, శిష్యుడు వీరుగాని పరిచరణము సేయ నగును. ఈరీతి నిత్య మాచరింప దగినది. అగ్ని ప్రాదుష్కరణ కాల మతిక్రమించినచో తరువాతి ప్రాదుష్కరణ కాలము వరకు యజమాను డుపవసింప వలయును. ఆ యగ్ని పాక యజ్ఞ తంత్రము వీడి యగ్నిహోత్ర హోమాను విధానముగా సాధించు కొనదగు. హోమార్థ హవిస్సు మాంసము కాఁజనదు.

వ్రీహి, యవ, తండులములలో నేదైనను గావను. సాయంకాలమున అగ్ని ప్రజాపతి ప్రాతఃకాలమున సూర్యుడు, ప్రజాపతి ఆహుతి దేవతలు. ప్రజాపత్యాహుతికి మాత్రము మంత్రము లేదు.

౧౦

వివాహమయిన వెంటనే వచ్చిన పౌర్ణమాసియందుఁ బార్వణస్థాలీపాక మను కర్మ ప్రారంభమగు. పర్వము లనగా దర్శ పూర్ణమాసములు. అమావాస్యయందు దీనియారంభణము కూడదు. దర్శ పూర్ణమాస కర్మలందు కర్తవ్యమైనయుపవాస మవసరము. అది యేకభుక్తము. దధిమిశ్రాన్నము గాని ఘృతమిశ్రాన్నము గాని క్షారలవణ వర్జముగా భుజింపనగు. పౌర్ణమాసియం దగ్ని, అగ్నీషోములు, అమావాస్యయం దగ్ని ఇంద్రాగ్నులు దేవతలు. ఫలమపేక్షించినపుడు ఉపాంసుయాజ ఇంద్ర మహేంద్రులును దేవతలుగా గ్రహింపదగినవారు. ఆయా దేవతల నుద్దేశించి నాల్గు నాల్గు పిడికళ్ళ హవిష్యద్రవ్యమును శూర్పమున పోసి వానియందు నిగూఢముగా పవిత్రద్వయము నుంతురు. పిమ్మట వానిని తత్తద్దేవత నుద్దేశించి సమంత్రకముగా నిర్వాపణము చేసి యట్లే ప్రోక్షింతురు. పత్ని వానిని గైకొని కృష్ణాజినముపై నుంచిన రోటిలో పోసి రోకటితో ముమ్మారు తెల్లగా నయ్యునట్లు దంచును. యజమానుడు ఆతండులములను మూడు సార్లు కడిగి ప్రోక్షించి పృథక్పాత్రములందు గాని యేకపాత్రమందు గాని పోసి యూపస్మ పక్వముగా వండును. ఇదియే చరువు నాబడు. ఇట పృథక్పాత్ర పచనపక్షమునఁ దత్తత్పాత్రము లందున్న తండులములను తత్తద్దేవతోద్దేశముగాఁ దాకనగు. ఏకపాత్ర పక్షమున పక్వమైన హవిష్యమును వేరుపఱచి హోమము చేయఁదగు. వండిన హవిస్సులను అభిఘరించి యుత్తరదిశగా దించి బర్హిస్సులందుంచి యిధ్మము నభిఘరించి హోమము చేయును. వాయవ్యమునుండి యాగ్నేయమునకు, నైరృతమునుండి యైశాన్యమునకు సమిద్ధ్యాన్యాజ్యధారలుగా రెండాహుతులను వేయును. పిమ్మట నగ్ని యుదగ్భాగమున నాగ్నేయాజ్యాహుతిని. దక్షిణ పార్శ్వమున సౌమ్యాజ్యాహుతిని వేయును. పశ్చిమాభిముఖమైన యగ్నిహోత్రమున కుదగ్భాగమున దక్షిణనేత్రము దక్షిణభాగమున సవ్యనేత్రమును నగును ఈయాహుతి ద్వయమునకాజ్యభాగములని వ్యవహారము. ఇక హవిష్యములను అగ్నిముఖస్థానమగు పశ్చిమరేఖపై నుంచదగు. సౌవిష్టకృత హవిస్సు నగ్నిలో నీశానభాగమున హోమము చేయవలయు. హవిష్యము అంగుష్ఠపర్వప్రమాణముగా గైకొనదగు. ఈయవదానమును రెండువిధములుగా నాచరింతురు. పంచావదానము

సేయువారు హవిస్సులో మధ్యభాగమునుండి, పూర్వభాగమునుండి, పశ్చిమభాగమునుండి గ్రహింతురు. తదితరులు మధ్యనుండి పూర్వభాగమునుండి గ్రహింతురు, సౌవిష్టకృత హవిస్సు పాత్రమునందలి యుత్తరభాగమునుండి గ్రహింపదగు. పిమ్మట పూర్ణపాత్ర జలముచే బర్హిస్సుల నాసేచనము చేయును. ఇదియే యీకర్మయం దవభృతమగుచున్నది. హుతసంజ్ఞకములగు పాకయజ్ఞములం దంతట నీవిధి యవలంబింపజను. మిగిలినహవిస్సును దక్షిణగా బ్రహ్మ కీయవలయు. బ్రహ్మలేనపుడు బ్రాహ్మణుల కైన నీయందగు.

౧౧

పశుకల్పనిరూపణము. ఇది శ్రౌతమునం జోదితమైనను నీ గృహ్యకర్మలందు మధుపర్కము నిచ్చినపుడు పశు విశసన మంగీకృతమైనచో నీవిధాన మావశ్యకము. మధుపర్క దానమందు ఋత్విజులకు బృహస్పతి దేవతాకము, స్నాతకునకు ఇన్ద్రాగ్ని దేవతాకము, రాజున కింద్ర దేవతాకము, ఆచార్యున కగ్ని దేవతాకము, స్నేహితునకు మిత్ర దేవతాకము, వరునకు ప్రజాపతి దేవతాకము, అతిథి కగ్నివైశ్వానర దేవతాకము నగు పశువు నొసంగుదురు.

అన్వాహ్నను అగ్ని కుదగ్భాగమున శామిత్రాయతనమును నిర్మించి మధు పర్కార్హునగు పశువునకు నీళ్ళుపెట్టి స్నానము చేయించి అగ్నికి పూర్వభాగమున పశ్చిమముఖముగా నిల్పి అగ్నియందు రెండాహుతులు వేసి, యాకులుగల పచ్చికొమ్మతో పశుపృష్ఠభాగమును స్పృశించును. వ్రీహి యవయుతమగు జలముచే దాని ముందు భాగమును ప్రోక్షించును. ఆజలమునే పశువునకు త్రాగించి మిగిలిన జలమును దానిముందు కుడికాలు చెంత పోయును. మంత్రరహితముగా నాపశువును వహ్నికి బ్రదక్షిణముగా నుత్తరభాగమున నిలిపి దానిముందు ప్రజ్వలించు కాష్ఠము నొకదానిని బెట్టుదురు. ఇది శామిత్రాగ్ని యనబడును. వపను వండు పాత్రములను గ్రహించి కర్త పశువును నంటి యుండును. యజమానుడు కర్తను తాకి యుండును. ఆశామిత్రాగ్నికి పశ్చిమభాగమున నున్న యీ పశువును తూర్పుతలగా గాని పడమరతలగా గాని పాదము లుత్తరముగ నుండునట్లు పరుండబెట్టి చంపి నాభికిం బూర్వభాగమున దర్భనుంచి కోసి వపనుతీయును. పిమ్మట దానిని వపాపాత్రమం దుంచి నీటిచేం గడిగి శామిత్రాగ్నియందు వపను దపింపజేసి దానికి ముందౌపాసనాగ్నిని వెల్చి దానిలో వప నుడికించి హోమము చేయును. ఈయౌపాసనాగ్నియందే పశుదేవతాకమైన స్థాలీపాకమును వండుదురు. పశ్వంగముల నుండి పదునొకం డవదానములను గ్రహించి శామిత్రాగ్నియందు వండి హృదయమును

మాత్రి మొక కోలమున గుర్చిచ్చి కాల్చి యుంచును. పిమ్మట స్థాలీపాకమును వేరుగా గాని అవదానములతోఁ గలిపిగాని హోమము చేయును. పిదప స్విష్టకృదాదివిధిని పూర్తిగావించును.

౧౨

చైత్యదేవత నుద్దేశించి "నేఁదలఁచిన కార్యము సిద్ధించినచో నిన్ను నే నాజ్యముచే గాని స్థాలీపాకముచే గాని పశువుచేఁ గాని పూజింపఁగల"నని మ్రొక్కినవాఁడా కార్యము ఫలించిన వెనుక యాగము చేయును. అది చైత్యయజ్ఞమని వ్యవహరింపబడు. చైత్యదేవతలనగాఁ పశుపతి, శంకరుడు, ఆర్య, జ్యేష్ఠ, ధన్వంతరి మున్నగువారు. ఈ యాగము స్వగ్రామమందైనచో నది చైత్యాలయముననే చేయఁదగు. విదేశమందున్న చైత్యదేవతయైనచో నాతముఖమున నా దేవతకు బలిని పంపుదురు. చైత్యయజ్ఞమున దేవతకు బలి వేయుదురు. ఈబలి స్విష్టకృత్తునకు ముందేయివ్వఁదగు. దూతను కానశిని మోదుగ చెక్కతోఁ జేయుదురు. రెండు పిండములు చేసి కావడియందుంచి దూతకిచ్చెదరు. అందొకటి దూతకు రెండవది చైత్యదేవతకని చెప్పుదురు. మార్గమధ్యమున నావచే దాటఁదగిన నది యున్నచో నొక తెప్పను భయము నాశంకించినచో నొక శస్త్రమును గల్పించి దూత కిచ్చెదరు. చైత్యదేవత ధన్వంతరి యగుచో బ్రహ్మకు; అగ్నికి మధ్య పురోహితునకై ముందు బలివేసి తరువాత ధన్వంతరి కొసంగవలయు, ఆ ధన్వంతరి విదేశస్థుడైనచో ధన్వంతరి పురోహితునకొకపిండము దూతకొకపిండ ముద్దేశింపఁదగినది.

౧౩

అనుపలభ్యమైన యొక యుపనిషత్తునందు గర్భలంభనము, పుంసవనము, అనవలోభనము, అని ఈరీతిగా నాత్మజ్ఞాన పర్యంతము కొన్ని చెప్పఁబడినవి. తదుపనిషదధ్యయనము లోపించినను గర్భాధానాదికర్మ లాచరింపఁదగినవి.

అందు పుంసవనము-గర్భ తృతీయమాసమునఁ బత్నిచేఁ బుష్యమి నక్షత్రమున నుపవాసము చేయించి పతి పుష్యమి నక్షత్రదినమునఁ ప్రజాపతి దేవతాకమగు స్థాలీపాకము చేసి సరూపవత్స యగు నావు పెరుగుచే నామె దోసిలి నింపి దానిలో రెండు మాషములు నొక యువబీజము నుంచి యా పెరుగు నామెచేఁ బ్రాశనము చేయింపవలయు. ఇట మాషద్వయమును వృషణద్వయముగను యవబీజమును లింగముగను భావింపవలయు. ఏమి త్రాగుచుంటివని మూమార్లు ప్రశ్నించి పుంసవనము అని మూమార్లు

పిమ్మట స్త్రీనిమిత్తముగా మండలాకారముగ నున్న రోకశాల నిర్మించి దానినీడ నామె నాసినం గావించి పచ్చిదిగానున్న తెల్లగరికను నూరి దాని రసముచే నామె దక్షిణ నాసికయందు నస్యకర్మ నాచరింపవలయు. తదుపరి పూర్వోక్తమైన స్థాలీపాకమును గొంతభాగము హోమము చేసి యామెహృదయమును స్పృశింపవలయు. స్విష్టకృదాది కర్మచే హోమకర్మ పూర్తి చేయనగు.

ఇది గర్భసంస్కారము గనుక ప్రతిగర్భమునకు జేయదగినది. ప్రథమగర్భనిర్ణయము తృతీయమాసమున గానిచో జతుర్థమాసమున నిది యాచరింపనగు.

౧౪

గర్భచతుర్థమాసమునఁ గాని షష్ఠాష్టమ మాసములందు గాని సీమన్తోన్నయనము చేయదగినది. శుక్లపక్షమునఁ జన్మదినము పుంసనామధేయ నక్షత్ర ఘటికలలో నడుమ ముప్పదిగడియల కాలమునందో గాంచియుండు నప్పుడు కర్మ చేయదగినది. పుష్యమి, హస్త, శ్రవణాదులున్నగునవి పున్నామధేయ నక్షత్రములు. పతి యగ్న్యాధానము చేసి యగ్నికి పశ్చిమభాగమునఁ బఱచిన బలీవర్దచర్మముపై బత్ని కూర్చుండి తనను దాకియుండగా ఏవిధి యాజ్యాహుతులు వేయును పిమ్మట సమసంఖ్యగల పచ్చిమేడికాయల గుత్తి, ఏదుబంటిముల్లు, మూడుతెల్లదర్భలు కలిపి హస్తమందలి దీనితో నామె లలాట కేశసంధిదేశమునుండి మూర్ధదేశమువఱకు ముమ్మారు పాపట దీయవలెను. పిమ్మట వీణాగాథకులను రావించి సోమగాథను గీర్తింపవలసినదిగా నాజ్ఞాపింప వారును పాత్రితమున నున్న నదిని సంబోధించుచు సోమగాథాగానము చేయుదురు. పిమ్మట పతిపుత్రవతులు వృద్ధలగు బ్రాహ్మణస్త్రీలు వచ్చి చెప్పినట్లు గావించవలెను. బ్రహ్మ ప్రతినిధి యాజ్యహోమము చేయించును. పిమ్మట కర్త బ్రహ్మకు దక్షిణ నొసంగవలెను. బ్రహ్మ లేనిచో సన్నిహిత బ్రాహ్మణులకీయవలెను. ఈసీమన్తోన్నయన మాధారసంస్కారము. ప్రథమగర్భమునందు మాత్రము దీనిం జేసిన యెడల సర్వగర్భములు సంస్కృతములైనట్లు భావింపదగును. జాతకర్మ సంస్కారము కుమారునకే గాని కుమార్తెకు లేదు. కొందఱు, కుమారికి గూడఁ జేయదగినది కాని యది యమంత్రిక మని నుడువుదురు.

సూతికాగృహమున నధికృతులైనవారు శిశువును తాకకపూర్వ మాశిశువునకు, ఘృతమును మధువును సువర్ణముతో చాది దాని నాసువర్ణముతోడనే ప్రాశనము

గావింతురు. కుమారుని కర్ణములందు హిరణ్యము నుంచి మేధాజనన మంత్రమును కర్ణ
ద్వయమునందు జపింతురు. భుజద్వయమును మంత్రమును జపించుచు తాకుదురు.

ఈసమయముననే కుమారునకు నామకరణము కూడ జేయుదురు. నామధే
యము "సాంవ్యవహారికము, అభివాదనీయము" అని ద్వివిధము. అందుసాంవ్యవహారిక
నామధేయ లక్షణము—మొదట ఘోషవర్ణము మధ్యయంతస్థవర్ణము తుద విసర్గము
నుండును. గ, ఘ, ఙ, జ, ఝ, ఞ, డ, ఢ, ణ, ద, ధ, న, బ, భ, మ, య, ర, ల, వ, హ
ఇవి ఘోషవర్ణములు. య, ర, ల, వ ఇవి యంతస్థవర్ణములు, రెండు గాని నాల్గు గాని
స్వరము లుండవలె. కుమారుడు ప్రతిష్ఠాకాముడు కావలయునన్న స్వరద్వయము గల
పదము, బ్రహ్మవర్చస్వి కావలయునన్న స్వరచతుష్టయము గల పదము గ్రహింపదగు.
లేక యుగ్మాక్షరపదము పురుషులకు [illegible] స్త్రీలకు నామధేయముగా నుం
డును. ఈ రెండవ పక్షమున [illegible] అభివాదన
యోగ్యమగు నామమును చేయుదురు. ఇది తలిదండ్రులు మాత్రమే తెలిసి
యుందురు. ఉపనయనమైన యనంతరము [illegible] నాచార్యున కభివాద
నము చేయుమని తండ్రి కుమారునకు చెప్పును.

ప్రవాసమునుండి వచ్చిన కుమారుని శిరమును [illegible] హస్తములతో
గ్రహించి ముమ్మారు మూర్ధాని మంత్రమును జపించును. కుమారి మంత్రరహిత
ముగా మూర్ధానదగు.

౧౬

జన్మించినదాదిగ షష్ఠమాసమున బుత్రిన కన్నప్రాశనము సమంత్రకముగ
చేయుదురు. కుమారు డన్నసమృద్ధి గలవాడు కావలయునన్న నజమాంసమును,
బ్రహ్మవర్చస్వి కావలయునన్న తిత్తిరి మాంసమును, తేజస్వి
కావలయునన్న ఘృతసంస్కృతాన్నమును, పైకోర్కె లేమియు లేనిచో దధి మధు
ఘృత మిశ్రితమైన యన్నమును అన్నముతో కలిపి ప్రాశనము గావింతురు. పుత్రికకు
మంత్ర రహితముగా జేయుదురు.

౧౭

జన్మప్రభృతి తృతీయ సంవత్సరమున గాని కులధర్మము ననుసరించి గాని
చౌలకర్మ నాచరింతురు. కొందఱుపనయన కాలమందు జేయుదురు.

అగ్నిప్రతిష్ఠాపనము గావించి తదుత్తర భాగమున నాల్గు శరావములందు

వ్రీహి యవ మాష తిలములను వేరువేరుగా నింపి యుంచును. అగ్నికిఁ బశ్చిమభాగమున తల్లి బిడ్డను తనయొడిలో నుంచుకొని యుండును. ఒక శరావమున వృషభపురీషమును, మఱియొక శరావమున శమీపత్రములను సిద్ధము చేసి యుంచును. తండ్రి యిరువదియొక్క సంఖ్యగల లేతదర్భలను గ్రహించి తల్లికి దక్షిణభాగమున నాసీనుఁడై యుండును. లేక యీ దర్భలను బ్రహ్మ యైనను గ్రహించి యుండును. పిమ్మట తండ్రి యాఘారాంతకర్మ నొనరించి యాజ్యాహుతులను వేల్చి కుమారునకుఁ బశ్చిమ భాగమున నుండి ఉదకుంభము నుండి శీతోష్ణ జలములను గ్రహించి కలిపి దానిలోఁ గొంత జలముతో, నవనీతము గాని దధిద్రప్సమందు ద్రవమును గాని కలిపి మంత్రపఠనము చేయుచు కుమారుని శిరమును సవ్యముగా మర్దించును. పిమ్మట లేతకుశలను మూడు త్రికములుగా నేర్పఱచి కుమారుని దక్షిణ కేశపక్షమున సమంత్రకముగా నుంచును. వానియందు సమంత్రకముగా తామ్రలోహ నిర్మితమైన కత్తి నుంచి కశసహిత కేశములను ఖండించి శమీపత్రములతోఁ గలిపి తల్లికిచ్చును. తల్లి వానిని వృషభపురీషము నందుంచును. ఉత్తరాగ్రదర్భత్రయముతో ద్వితీయ ఛేదమును తృతీయ ఛేదమును గావించును. పై ఛేదనముల నుపయోగించిన మూడు మంత్రములతో నాల్గవఛేదము నాచరించును. ఇట్లే యుత్తర కేశపక్షమున మూడు ఛేదములను మాత్ర మొనరించును. కత్తిని సమంత్రకముగా శోధించిన పిమ్మట నాపితు నాజ్ఞాపించి కులధర్మానుసారముగా క్షురకర్మను చేయింతురు. తరువాత స్విష్టకృదాదులచే నగ్నికర్మను పూర్తిగావించును. ఈ కర్మను పుత్రికకు అమంత్రకముగా చేయుదురు.

౧౮

గోదానసంస్కారము చౌలమువలె జేయఁదగినది. దీనిసమయము జన్మప్రభృతి షోడశవర్షము. కుమారుడు తల్లియొడియందుండ నవసరము లేదు. చౌలకర్మయందు గోచరించు కేశశబ్దస్థానమున శ్మశ్రుశబ్ద ముపయోగింపనగు, శ్మశ్రువులన ముఖలోమములు. చౌలమునందు శిరమువలె శ్మశ్రువులను దడుపును. పిమ్మట సమంత్రకముగా క్షురధారను మార్జనముగావించి యంబష్ఠు నాజ్ఞాపించును. నాపితుడు శీతోష్ణ జలముతో కేశ శ్మశ్రు లోమ నఖముల నుదగంతముగా వపనము గావించును. పిమ్మటఁ గుమారుడు స్నాన మాచరించి మౌనము దాల్చి యాచార్యుని సమీపమున ఆదిత్యు డస్తమించు నంతవరకు నిలబడి తదనంతరము మౌనము వీడి దక్షిణనిచ్చెద నని యాచార్యునితోఁ జెప్పి గోమిథునము నివ్వవలయు.

౧౯

జన్మప్రభృత్యష్టమ వర్షమునఁ గాని గర్భాష్టమ వర్షమునఁ గాని బ్రాహ్మణున కుపనయనము చేయఁదగును. ఈ సంస్కారము కుమారికి లేదు. అట్లే పదునొకొండవ సంవత్సరమున క్షత్రియునకుఁ బండ్రెండవ సంవత్సరమున వైశ్యునకు నుపనయనము చేయవలెను. పదునారు సంవత్సరములవఱకు బ్రాహ్మణునకు, నిరువది రెండువరకు క్షత్రియునకు, నిరువదినాలుగువఱకు వైశ్యునకు, నుపనయనార్హత గలదు. ఆపైన వారు సావిత్రీపతితు లగుదురు. కావున వీరి కుపనయనము కూడదు. వేదము చెప్పఁగూడదు. క్షురకర్మానంతరము కుమారుని నలంకరించి నూత్నవస్త్రమును ధరింపఁజేయుదురు. చర్మముల నివ్వఁదలచినచో బ్రాహ్మణునకుఁ గృష్ణాజినము క్షత్రియునకు రురుచర్మము. వైశ్యునకు నజచర్మము నివ్వఁదగును. రక్తవస్త్రము లైనచో బ్రాహ్మణునకుఁ గాషాయము క్షత్రియునకు మాంజిష్ఠము వైశ్యునకు హారిద్రము [illegible].
వీరికి మేఖలలు:— బ్రాహ్మణునకు ముంజి, క్షత్రియునకు వింటినారి, వైశ్యున కవిలోమ నిర్మితము నుచితము.
దండములు:— బ్రాహ్మణునకు కేశాంతప్రమాణము గల మోదుగ దండము, క్షత్రియు[illegible]సమ్మితమైన మేడిదండము, వైశ్యునకు నాసికాగ్రసమ్మితమైన మారేడు దండ[illegible]గును.

౨౦

పూర్వోక్తదండములు వికల్పముగ నందరికి నివ్వవచ్చును. [illegible] [illegible]మైన తరువాత నటు ననుసరించి యుండగా నాచార్యుఁడు అగ్నియం దాజ్యాహుతులను వేల్చి తదుత్తర భాగమున ప్రాఙ్ముఖముగ నుపవిష్టుఁ డగును. బ్రహ్మచారి యాచార్యునిముందుఁ బ్రత్యఙ్ముఖుఁడై కూర్చుండును. ఉదకముతో బ్రహ్మచార్యంజలి నాచార్యుఁడు నింపును. ఆచార్యాంజలి నితరుఁడు నింపును. ఆచార్యుఁడు తన యంజలిని బ్రహ్మచార్యంజలితో సమంత్రకముగా విడిచి బ్రహ్మచార్యంజలిని స్రవింపఁజేసి వాని సాంగుష్ఠహస్తమును గ్రహించును. ఇట్లంజలి పూరణాది హస్తగ్రహణాంత మాచార్యుఁడు ముమ్మారు చేయును. పిమ్మట నాచార్యుఁడు బ్రహ్మచారికి సూర్యుని జూపును. ఆచార్యుఁడు మంత్రమును జపించుచు బ్రహ్మచారిని ప్రజాపతికి పరిదానముఁ జేయును. మంత్రమును జపించు బ్రహ్మచారిని ప్రదక్షిణముగా తిరుగు మనును. తన రెండుచేతులను బ్రహ్మచారి భుజములందుంచి సమంత్రకముగా వాని హృదయమును స్పృశించును.

పిమ్మట బ్రహ్మచారి అగ్నికిఁ బరిసమూహన మాచరించి మంత్రరహితముగా సమిదాధానముఁ జేయును.

౨౧

ఈసమిదాధానమున గొందఱు మంత్రమునంగీకరింతురు. బ్రహ్మచారి సమిదాధానముఁజేసి యగ్నిని స్పృశించి మంత్రము నావర్తించుచు, ముమ్మాఱు ముఖమును నిర్మార్జనము చేసికొనును. ఆఱుమంత్రములచే నుపస్థానము చేసి దక్షిణజానువును వంచి యాచార్య పాదోపసంగ్రహణము చేసి సావిత్రి నుపదేశించుడని ప్రార్థించును, ఆచార్యుఁడు వాని ధారణవస్త్రముచేతను తన హస్తములచేతను వాని పాణిద్వయమును గ్రహించి సావిత్రిని ముమ్మారుపదేశించును. ప్రథమపర్యాయము పాదములుగ రెండవసారి అర్ధర్చములుగా, మూడవసారి సంపూర్ణముగా నుపదేశించును. బ్రహ్మచారి హృదయదేశమునం దాచార్యుఁడు దనహస్తము నూర్ధ్వాంగుళిగా నుంచి మంత్రమును పఠించును.

౨౨

ఆచార్యుఁడు వటువునకు మేఖలను గట్టి దండము నిచ్చి బ్రహ్మచర్యము నీరీతి నుపదేశించును. "నీవిపుడు బ్రహ్మచారివైతివి. మూత్రోత్సర్జ నాదులందు శాస్త్ర విహితాచారమును జేయుము. యథాశాస్త్రముగ సంధ్యోపాసనాది కర్మలను జేయుము. పగటి నిద్రమానుము. ఆచార్యాధీనుఁడ వగుము. వేదాధ్యయనము చేయుము" అని చెప్పును.

ఈ వేద బ్రహ్మచర్యము పండ్రెండు వత్సరములు గాని, వేద గ్రహణాంతము గాని యాచరింపఁదగును. సాయం ప్రాతఃకాలములందు సమిదాధానము చేయఁదగును. ఆచార్యుని కొఱకును దన భోజన నిమిత్తమును భిక్ష నర్థించును. ఈ రెంటిలో క్రమ నియమము లేదు. భవచ్ఛబ్ద పూర్వకముగ ననుప్రవచనీయ భిక్షను లేదనక పెట్టువారి నర్థించును. దానిని గురువున కర్పించి సూర్యు డస్తమించువరకు నిలిచి యుండును, ఆదిత్యు డస్తమించినపిమ్మట ననుప్రవచనీయమైన భైక్ష్యమును బ్రాహ్మణభోజనార్థము పాకయజ్ఞ విధానముగా వండి స్థాలీపాకము సిద్ధమైనదని యాచార్యునకు నివేదింపదగును. ఆచార్యుఁడు తనను బ్రహ్మచారి తాకియుండగా నాస్థాలీపాకమందు కొంతభాగ మగ్నియందు ప్రథమాహుతిగా హోమముఁజేయును. అనూక్తమగు సావిత్రిచే ద్వితీయహోమముఁజేయును.

ఇశ్లే ముందును గూడననూక్తమైన దెల్ల నచ్చటచ్చట ద్వితీయ హోమార్థమగుచుండును. ఋషులనుద్దేశించి తృతీయ హోమముఁ జేయును. సౌవిష్టకృత హోమమును నాల్గవ దాని నిగాఁ జేయును. పిమ్మట బ్రాహ్మణులను భుజింపఁ జేసి వారిచే వేద సమాప్తిని పలికించును. ఇటు పైన బ్రహ్మచారి క్షార లవణములను భుజింపక త్రిరాత్రముకాని, ద్వాదశ రాత్రముకాని సంవత్సరము గాని నేలపై శయనించును. ఈ రీతిగా వ్రతము నాచరించిన వటువున కాచార్యుఁడు మేధాజననమను కర్మ నొనరించును. అనిందితమైన దిక్కునందు పలాశమును గాని కుశస్తంభమును గాని పాతి యుంచును. ఉదకుంభము గైకొని దానికిఁ బ్రదక్షిణ మాచరించుచు ముమ్మారు తడుపుచున్న బ్రహ్మచారిచే నాచార్యుఁడు మంత్రము నుచ్చరింపఁ జేయును. దక్షిణము, ఆగ్నేయము, నైరృతము ఈ మూడును నిందితములు. వపనసంస్కార మారంభించి పరిదానాంత వ్రతాదేశ విధానముగా నెఱుంగదగు. ఇది యంతయు ప్రథమోపనీతుని విషయము. ప్రాయశ్చిత్తార్థమై మరల నుపనయనము చేయవలసినపుడీవిశేషముగలదు. కేశవపనము మేధాజననము వైకల్పికములు పరిదానము లేదు. కాల నియమము లేదు. విలక్షణమైన సావిత్రి నుపయోగింపవలయు.

౧౩

అన్యూనానతిరిక్తాంగులై మాతాపితరులం దలపించుచు కర్మసమర్థులగు వారిని ఋత్విజులుగా వరింపదగు. ప్రథమమున బ్రహ్మను వరింపవలయు. పిమ్మట హోత అధ్వర్యుఁడు ఉద్గాత వరింప దగినవారు. కౌషీతక్యాచార్యులు కర్మలకు పద్రష్టయగు నొక సదస్యుని పదునేడవ వానినిగా వరింపవలె నని చెప్పిరి. నల్వురను మించి ఋత్విజులను వరించునపుడు హోతను ప్రథమముగా వరింపవలయు. వృతులైన ఋత్విజులు తత్తన్మంత్రములను జపించి ప్రతిజ్ఞలు చేయుదురు.

ఋత్విగ్వివాదముచే వదిలిన జన్మమున కార్త్విజ్యము చేయఁగూడదు. అల్ప దక్షిణగల యహీనక్రతువునకు, వ్యాధిపీడితుడై మంచము పట్టిన వానికి, యక్ష్మరోగికి శ్రాద్ధాదులందు బ్రతిషిద్ధమైనవానికి, కులటకుఁబుట్టినవానికి నార్త్విజ్యమెన్నడును జేయఁ దగదు. సోమయాగమునకై పిల్వవచ్చినవానిని యజ్ఞమేది? ఋత్విజులెవ్వరు? దక్షిణయెంత? అని ప్రశ్నించి తెలియుదగు. మంగళ స్వరూపులగు ఋత్విజులతోఁగూడి సంతృప్తికరమగు దక్షిణగల క్రతువున కార్త్విజ్యము చేయుటుచితము. క్రతువు నారంభించినది మొదలవభృతమువరకు ఋత్విజులు మాంసభక్షణము స్త్రీ సంగమము నాచరింపఁ గూడదు.

ఈ రీతిగా ఋత్విజులను వరించి మధుపర్కము నీయవలయును. మఱియుఁ గృతసమావర్తనుఁడై గృహమునకే తెంచినవాని కాదినముననే మధుపర్కమివ్వదగు. యింటికివచ్చిన రాజునకు నిత్తురు. ఇట్లే యాచార్యునకు మామకుఁ బినతండ్రికి మేనమామకు మధుపర్కము నివ్వవలయును.

విష్టరము పాద్య మర్ఘ్య మాచమనీయము మధుపర్కము గోవువీని నొక్కొక్కటి ముమ్మారుగా దాత ప్రతిగృహీతకు నివేదించును. దధియందు మధువును గలిపినచో నయ్యది మధుపర్కము. మధువులేనిచో ఘృతమునుంచవచ్చును. పాద్యార్ఘ్యాచమనీయములకు ద్రవ్య ముదకమగుచున్నది గ్రహీత, మంత్రమును జపించుచు నుదగ్రముగా నున్న విష్టరము నలంకరించును. పాదప్రక్షాళనమునందు బ్రాహ్మణునకు దక్షిణపాదాదిగా నాచరించదగు. శూద్రునకు నుత్తరపాదాదిగాఁ జేయదగు. క్షత్రియ వైశ్యులకనియతముగా గ్రహింపవచ్చును తదనంతర మంజలితో నర్ఘ్యము నియ్యవలయు. అర్ఘ్యమనగా గంధమాల్యాది సంయుక్తోదకము. గ్రహీత యర్ఘ్య గ్రహణానంతర మాచమనీయోదకముతో సమంత్రకముగా నాచమనముచేసి గంధమాల్యాదులనుధరించును. దాత తెచ్చిన మధుపర్కపాత్రమును మంత్రముచేఁ జూచును. మంత్రమును జపించుచు నంజలిచే దానిని గ్రహించి మూత నెత్తి త్ర్యృచముచే మధుపర్కమును జూచి తన యనామికాంగుష్ఠములచే ముమ్మారు ప్రదక్షిణముగ నవలోడనము జేసి తత్తన్మంత్రములతోఁ దూర్పు మొదలగు నాలుగు దిక్కులం దనామికాంగుష్ఠములతోఁ బ్రోక్షించును. పిమ్మట నాపాత్రమును నేలపై నుంచి దాని మధ్యనుండి మధుపర్కమును గ్రహించి ప్రాశనముఁ జేసి శౌచాచమనముఁ జేయును. ఇట్లు ప్రథమ ద్వితీయ తృతీయ ప్రాశనములను జేయును. మధుపర్కము నెల్ల ప్రాశనము చేయగూడదు. తృప్తినొంద గూడదు. మిగిలినదాని నుత్తరాభిముఖుడై బ్రాహ్మణు లున్నచో వారికీయవలయు. లేనిచో జలమందుంచదగును. సమంత్రకముగ నాచమనీయోదకముచే నాచమించి శౌచార్థ మితరోదకముతో పునరాచమనము చేయదగు. పిమ్మట వానికి దాత గోవును నివేదించును. ప్రతిగ్రహీత దానిని చంపింపదలచినచోఁ దనయంగీకారమును దెలియఁజెప్పును. దాత దానిని చంపును. గోవును విడువ దలచినచో "దానిని విడువుడ"ని చెప్పవలయును. మాంసవర్జముగా మధుపర్కముండనేరదు. గోవును జంపినచో తన్మాంసముతోఁగాని చంపనిచో మరియొకదాని మాంసముతో గాని భోజన మిడనలయును.

# ద్వితీయాధ్యాయము

౧

శ్రవణ నక్షత్రయుక్త పౌర్ణమాసియందు శ్రవణాకర్మ సర్పబలి అను కర్మద్వయము సంచరింపవలయు.

పగలు యవలపిండితో నింపిన నూత్నకలశమును, బలినిగ్రహించుటకై వికంకత (పుల్లవెలగ) తో నిర్మితమైన దర్విని నూతనమైన యుట్టిలో నుంచుకొనవలయు. యవలవటుకులుగాఁజేసి వానిలో సగము నాజ్యముచేఁ దడిపి సగమును విడిగా నుంచుకొనునది

సూర్యుడస్తమించిన పిమ్మట నౌపాసనాగ్నియందు స్థాలీపాకమును ఏకకపాల పురోడాశమును వండునది. వండిన పురోడాశ పాత్రమునందాజ్యమునా పురోడాశము మునుగునట్లు గాని దానిపై భాగము కనిపించు నట్లుగాని పోసియుంచుకొనదగు. స్థాలీపాకము నాల్గుబుజ్మంత్రములతోఁ బ్రత్యేకముగా హోమము చేయఁదగు. పురోడాశము పూర్వోక్తాజ్యపాత్రముచేతనే హోమము చేయదగినది, దీనికి ఉపస్తరణాభిఘారములు సవ్యహస్తముచే నొనరించి దక్షిణ పాణితో హోమము చేయదగు, ఇది సర్వాహుతము గనుక నిట నవదాన ధర్మములేదు. అంజలితో నటుకులు సమంత్రకముగా హోమము చేయనగు. ఇట నుపస్తరణావదాన ప్రత్యభిఘారణము లన్నియు నిర్వర్తింపనగు. పొడి యటుకులను బుత్రాదులకుఁ బెట్టవలయు. పిమ్మట స్విష్టకృద్ధోమముచేసి హోమశేషము సమాప్తి గావింపవలయు.

సర్పబలియందుఁ బూర్వముట్టిలో నుంచఁబడిన దర్వియందు కలశమందలి పిండినిఁ బూరించునది. పిమ్మట నింటికిదగ్గరగాని దూరమునగాని తూర్పు దిక్కుగాఁ బవిత్రప్రదేశమున నీళ్ళుచల్లి సమంత్రకముగా యవపిష్టము బలిగా నుంచఁదగు. ఆ పిష్టమును మంత్రముచే నమస్కరించి ప్రదక్షిణముచేసి దానికి దక్షిణభాగమునఁ గూర్చుండి మెల్లగా మంత్రము నుచ్చరించుచు పరిదానము చెప్పనగు. క్రమముగాఁ బుత్రదుహితృభార్యలను తనను పరిదానము సేయనగు. పరిదానమనగా నివేదనము ఈపరిదానము చేయునంతలో బలికిఁ దనకు మధ్యనెవ్వరు వెళ్ళగూడదు. ప్రత్యవరోహణా

కర్మ నాచరించువరకు సాయంప్రాతఃకాలములందు నిత్యము బలివేయునది. ఈ నిత్యబలి యందుఁ గలశము, యవపిష్టము, దర్వి, పవిత్రప్రదేశము పూర్వోక్తములే గ్రహింపదగు.

ఇటఁగొందరు శ్రావణ ప్రతిపత్తు మొదలు ప్రత్యవరోహణ కర్మానుష్ఠాన దినము ముందువరకు సంభవించు సహస్సులను లెక్కించి వాని సాయంప్రాతః కాలముల నుద్దేశించి బలిదానములను ప్రథమ దినముననే యాచరింపవచ్చునని యందురు. ప్రత్యవరోహణకర్మ మార్గశీర్ష శుక్లచతుర్దశియందు గాని పౌర్ణమాసియందుగాని చేయుదురు.

౨

అశ్వనీ నక్షత్రయోగముగల పౌర్ణమాసియందాశ్వయుజీ కర్మచేయనగు. ప్రత్యవరోహణ కర్మోక్తరీతిగా గృహమునలంకరింతురు. గృహమందుండు వారు కర్మాంగ స్నానమాచరించి శ్వేతవస్త్రములను ధరింతురు. యజమానుడు పశుపతి నుద్దేశించి స్థాలీపాకమును పచనము చేయును. దానిలోఁగొంత భాగమును హోమము సేయును. పుత్రాదులు యజమాను నంటియుందురు. పృషాతకము నంజలియందు స్రువముచే గ్రహించి హోమము చేయును. అంజలియందుప స్తరణాభి ఘారము లితరులు సేయుదురు. పృషాతకమనగా ఆజ్యము కలిపిన క్షీరము. కర్మలందంతట ద్రవద్రవ్యములను స్రువముచేతను కఠినద్రవ్యములను కత్తిచేతను గ్రహించునది.

శరదృతువునందుఁ పౌర్ణమాసియందుగాని యమావాస్యయందుగాని యాగ్రయణ స్థాలీపాకము చేయనగు.

వ్రీహిధాన్యమునుదంపి తండులములను గ్రహించునది. వానిచే హవిష్యమును వండి మూడాహుతుల నగ్నియందు వేల్చును. స్విష్టకృద్ధోమము గూడనయిన పిమ్మట నాహవిష్యమును సవ్యహస్తమునందు గ్రహించి దక్షిణహస్తాభిమర్శనచే నభిమంత్రించి యజమానుడు సమంత్రకముగాఁ బ్రాశనము చేయును. పత్నియమంత్రకముగాఁ బ్రాశనము చేయును. యజమానుడు ఆచమనము చేసి యచ్చటనే కూర్చుండి తన నాభిదేశమును సమంత్రకముగా తాకును. హోమశేషమును బూర్తిగావించును.

యవధాన్యముతో నాగ్రయణకర్మ చేయదగదు. శ్యామాకధాన్యముతోఁ బ్రస్తరసంజ్ఞకమగు స్థాలీపాకముతో, సమానతంత్రముగ సౌమ్యస్థాలీపాకమును గూడ వండి హోమము చేయనగు. గృహస్థుడు ఆగ్రయణస్థాలీపాకము చేయక నవధాన్య భక్షణము సేయదగదు.

ఇది యాశ్వయుజ పౌర్ణమాసి యందే యాచరించునేని నాశ్వయుజీ కర్మతో సమాన తంత్రముగా చేయునది. ఆశ్వయుజీ కర్మప్రధాన హోమము చేసి యాగ్రయాణకర్మ ప్రధానహోమము నిర్వర్తింపఁదగు ఈ రెంటికి స్విష్టకృదాదులేక తంత్రముగా నొనరింపఁదగు. ఆహితాగ్నికి ననాహితాగ్నికిని నాగ్రయణము చేయదగినది. ఆహితాగ్నికిఁ త్రేతాగ్ని సాధ్యమైన యాగ్రయణము విధింపఁబడిననునిచట పాకయజ్ఞత్వసిద్ధికై పేర్కొనబడినది.

3

మార్గశిరమాస శుక్ల చతుర్దశి యందుగాని పౌర్ణమాసియందు గాని ప్రత్యవరోహణకర్మ చేయుదగినది. ఇందు గృహమును సంస్కరింతురు. పగలు గోడలకుఁ బూత పూసి దానిపై మరల నొకపూత పూసి భూమియందలి యెత్తుపల్లములను సరిచేయుదురు. ఉత్తరేణి మున్నగు వానిని పెకలించి వేతురు.

ఆదిత్యుఁడస్తమించిన తరువాతఁ బాయసమువండి దానిలోఁ గొంతభాగమును సమంత్రకముగా హోమము సేయుదురు. ఇట స్విష్టకృత్తు లేదు. ఇట్లనుటచే నితరకర్మల యంతములందు స్విష్టకృత్తు వైకల్పికమని తెలియఁదగు. మంత్రమును జపియించి హేమన్త శబ్దమును సంబుద్ధ్యన్తముగా నుచ్చరించి హేమన్తమును జిత్తమున ధ్యానింపనగు. పిమ్మటఁ గర్తయగ్నికిఁ బశ్చిమ భాగమునఁ దాను పుత్రాదులు శయనించుటకొరకు శయ్యను ఊకతో నిర్మించును. దానియందుఁ గూర్చుండి మంత్రమును జపించి పుత్రాదులతోఁ గూడి తూర్పుగా శిరమునుంచి యుదఙ్ముఖుఁడై శయనించును. ఈ శయనము జ్యేష్ఠానుపూర్వముగాఁగాని యథావకాశముఁగాని చేయును. ఇట మంత్రజపము శయనించినవారిలో మంత్రవిదులందరు పఠింపవచ్చును. శయనించిలేచి ప్రాఙ్ముఖులై మున్మూరు మంత్రముల జపించి మరల శయనింతురు. మరల లేచి కూర్చుండి దక్షిణాభిముఖులై మంత్రప్రథమ పాదము నొకసారి జపించి శయనింతురు. ఇట్లే పశ్చిమాభిముఖులై ద్వితీయపాదము నొకసారి, ఉత్తరాభిముఖులై తృతీయపాదము నొకసారి, జపించి శయనింతురు. సూర్యోదయమైనపిమ్మట నందరులేచి కూర్చుండి సూర్యదేవతాకములైన మంత్రములు స్వస్త్యయనమంత్రములు. నుచ్చరింతురు. స్వస్తిశబ్దము శ్రూయమాణముగనవి స్వస్త్యయనములు. అన్నమును సంస్కరించి బ్రాహ్మణులకు భోజనమిడి స్వస్త్యయనము బ్రాహ్మణులచేఁ జెప్పింపవలయు.

హేమన్త శిశిరఋతువులలోఁ గృష్ణపక్షములందు వచ్చెడి యష్టమీ చతుష్టయమునందు అష్టకాకర్మల నాల్గింటిని నిర్వర్తింపనగు. ఈ యష్టకాచతుష్టయము నొకే యష్టమితిథియందైన నాచరింపవచ్చు. ఈ యష్టమీ తిథులకుఁ బూర్వతిథులైన సప్తమీ తిథులందుఁ బితృపితామహప్రపితామహులకుఁ బిండపితృయజ్ఞ విధానముగాఁ బిండనిర్వాపణముచేసి పార్వణమునందువలె భోజనము పెట్టనగు. కాని పిండపితృయజ్ఞవిధి పితృదేవతలలో స్త్రీలకుఁగూడ నుద్దిష్టము. ఈ యష్టకలు పురుషదేవతలకు మాత్రమే. మఱియు పిండపితృయజ్ఞము నందగ్నౌకరణ విధానముండుటచేఁ బాకయజ్ఞసంజ్ఞలేదు. అష్టకలందోదనము, కృసరము, పాయసము, ఈ మూడును చరుస్థానీయములు. తిలసమ్మిశ్రమైన యన్నము కృసరము. నాల్గుశరావములకు సరిపడు వరిపిండితో వండిన యపూపములైనను చరుద్రవ్యము గావచ్చును. ఈ నియమము హోమవిషయముననే గాని భోజనమందుగాదు.

బ్రాహ్మణపాదప్రక్షాళనాచ్ఛాదన ప్రదాన పర్యంతము పార్వణము నందువలెఁజేసి పూర్వోక్తములగు నన్నాదులగు మూటినుండి కొంతకొంత గ్రహించి ఘృతముచేఁ దడిపి బ్రాహ్మణానుజ్ఞ వడసి యగ్నౌకరణ మన్త్రములకు బదులు "ఉదరీతామవర" అను మంత్రము మొదలెనిమిదింటిచే నెనిమిదాహుతులను వేయును. లేక పితృలింగకములగు పదునాలుగు మంత్రములచేఁ బదునాలుగాహుతులను వేయును. పిదప మేక్షణమునను ప్రహరణము చేయును. పదంపడి బ్రాహ్మణుల కన్నాదిశేష నివేదనాంతము పార్వణవిధిగా నొనరించును. బ్రాహ్మణ భోజనానంతరము పిండపితృయజ్ఞోక్త ప్రకారము వినయనాది పాత్రోత్సర్గాంతము చేసి శ్రాద్ధశేషము పూర్తిగావించును.

మరునాడు చేయవలసిన యష్టకా కర్మలు పశువుచేతఁగాని స్థాలీపాకముచేతఁగాని నిర్వర్తింపనగు. లేక బలీవర్దమునకు తృణసంచయము నియ్యనగు. లేక యగ్నిచేత తృణసంచయమును దహింపఁదగు. ఈ అమవసదాన, కక్షదహన సమయములందిదియే నేచేసెడి యష్టకాకర్మ యని చిత్తమున ధ్యానించునది. ఈనాల్గు పక్షములలో దేనినైన నాచరింపవలయునే గాని యష్టకా కర్మరహితుడు కాఁగూడదు. ఈ యష్టకకు అగ్ని, ఆదిత్యుడు, ప్రజాపతి, రాత్రి, నక్షత్రములు, ఋతువులు, పితృదేవతలు, పశువు దేవతలుగా వినబడుటచే నిది బహుదేవతాకమైనది. కాని కొందఱు వీనిలో నేదేనొక్క దేవతకుఁ బ్రాధాన్యమిచ్చి తక్కిన దేవతావాచకములను తద్దేవతాపరముగ వ్యాఖ్యానింతురు.

పశుకల్పోక్తప్రకారము పశువునుచంపి దానివపను హోమము చేయునగు సర్వాంగస్థాలీపాకమునకు స్థాలీపాకాంతరమున కాహుతి మంత్రము లేదు. స్విష్టకృత్తు ఎనిమిదవది. అనంతరము బ్రాహ్మణులకు భోజనము పెట్టి వారిచే స్వస్త్యయనము వచింపచేయదగు.

౫

మరునాడు నవమియందన్వష్టక్యమను కర్మను చేయును. అష్టమినాటి పశుమాంసమును బ్రాహ్మణ భోజనార్థము సంస్కరించును. దక్షిణ ప్రవణమగు స్థండిలమందగ్న్యాధానము చేసి దానినందు పచనము చేసి దానికుదగ్భాగమున ద్వారము చేసి సమూలములగు బర్హిస్సులచే నప్రదక్షిణముగాఁ గంపింపఁజేయక ముమ్మారు పరిస్తరణము చేయును. ఆబర్హిస్సులపై హవిష్యములగు నోదన, కృసర, పాయస, దధిమంథ, మధుమంథముల నాసాదించును. దధిమంథమనగా దధిమిశ్రమైన పిష్టమగు. మధుమంథ మన మధుమిశ్రమైన పిష్టమగు. ఈ హవిష్యములను నిత్యాగ్నియందే పచనము గావింపవలయు ఈకర్మ పిండపితృయజ్ఞ విధానముగా చేయునగు. ఆసాదింపఁబడిన హవిష్యములనుండి మధుమంథవర్జముగా నన్నము గ్రహించి యభిఘరించి బ్రాహ్మణానుజ్ఞ వడసి యగ్నియందు రెండాహుతులను చేసి మేక్షణమునగ్నియందుంచును. తరువాత అన్న శేషనివేదనాంతమాచరించి పితృదేవతలకుఁ బిండ నిర్వాపణము చేయును. మధుమంథము పిండదానసమయమున గ్రహింపనగు. అన్వష్టక్యమందు స్త్రీలకుఁగూడఁ బిండనిర్వాపణము చేయఁదగు. స్త్రీలవిషయమున నాచామద్రవముగా సురసదనముగా నియ్యనగు. ఆ చామద్రవమనగా నోదనాగ్రద్రవము. ఇది గుడనిర్మితము, మధునిర్మితము, పిష్టనిర్మితమని త్రివిధము. రెండు లేఖలనుగీసి వానిని దర్భలచే నాచ్ఛాదించునది. ఇందుఁ బూర్వలేఖపైఁ బురుషులకు రెండవలేఖపై స్త్రీలకు పిండనిర్వాపణము చేయునగు.

ఇటఁగొందరు రెండుగాని యాఱుఁగాని గుంటలను త్రవ్వదగునందురు. రెండయిననేని పొడవుగాను ఆరయ్యేనేని గుండ్రముగాను నుండదగునందురు.

భాద్రపదమాస బహుళపక్షమున సప్తమియందు మాధ్యావర్షమను కర్మ చేయదగినది. ఇదియుఁ బూర్వోక్తాష్టకాకర్మవలెనే సప్తమి, యష్టమి, నవమి, ఈ తిథిత్రయ వ్యాపినిగఁ జేయదగు.

ప్రతిమాసము కృష్ణపక్షమున నయుగ్మతిథులందన్వష్టక్యవిధానము నవలంబించి పితృదేవతలకు శ్రాద్ధకర్మ చేయునది. స్త్రీలకుఁ గూడను. భోక్తలసంఖ్య తొమ్మిదికి తగ్గరాదు. అశక్తుడయినచో నవసంఖ్యకు లోపల ఏడు, అయిదు, మూడు, ఒకటి యుండవచ్చును. వృద్ధిశ్రాద్ధములందుగాని పూర్త శ్రాద్ధములందుగాని భోక్తలు సమసంఖ్యాకులుగా నుండదగు. పితృశ్రాద్ధము నొనరింపక వైదికకర్మ నాచరింపరాదని శ్రుతి వచనము. షోడశ సంస్కారములు, శ్రవణాకర్మ మున్నగునవి. శ్రౌతకర్మలు వృద్ధి శ్రాద్ధ విషయములు. వాపీకూప తటాకారామాద్యుద్యాపనాదులు పూర్త శ్రాద్ధ విషయములు. వృద్ధి పూర్త శ్రాద్ధములందు సమసంఖ్యాకులను భోక్తలుగా నెంచునది. అష్టకాశ్రాద్ధమున, కామ్యశ్రాద్ధమున, ఏకోద్దిష్టమున, నసమసంఖ్యాకులను గ్రహించునది. వృద్ధి పూర్త శ్రాద్ధములందు ప్రదక్షిణముగా నుపచారము. తిలలకుబదులు యవలు గ్రాహ్యములు.

౭

త్రైవర్ణికులు రథము నధిరోహించునపుడు సమంత్రకముగా జక్రములనుఁ బాణిద్వయముచేఁ దాకుదురు. అట్లే చక్రనాభిప్రదేశములను స్పృశింతురు. సమంత్రకముగా దక్షిణపాదమునుంచి యధిరోహింతురు. పగ్గములను సమంత్రకముగాఁ బట్టుకొందురు. పగ్గములులేనియెడల రథాశ్వములను దండముతో సమంత్రకముగా స్పృశింతురు. సారథి చోదితములై యశ్వములు గమ్యస్థానమునకుఁ బోవునపుడు వానస్పత్య మంత్రమును జపింతురు.

శకటము మున్నగువానిని బైమంత్రముచేత దాకుదురు. మఱియొక మంత్రముచేత బలీవర్దములను, బండికంటిని, ఏడికోలను, కాడిని స్పృశింతురు.

నావ నధిష్ఠించునపుడు మంత్రమును పఠింపుదురు. పూర్వమనుపభుక్తమైన రథమునధిరోహించునపుడు పూర్వమందుజెప్పినరీతి వానస్పత్యమంత్ర జపాంతమాచరించి యిట్లు చేయుదురు. యశోవంతమైన వృక్షమును, నిండుచెరువును ప్రదక్షిణము చేసి వచ్చునపుడు మామిడి నేరేడు మున్నగుఫలవద్వృక్షశాఖలను తీసికొనివత్తురు. లేదా స్వకుటుంబమున కుపయోగపడు ద్రవ్యములను స్వగృహమునకుఁ దెత్తురు. పదంపడి యానవరథమును సమంత్రకముగాదిగి మంత్రజపపూర్వకముగా గృహమునఁ బ్రవేశింతురు.

పిదప సూర్యుడస్తమించువరకొక మంత్రమును అస్తమించినతరువాత మరియొక మంత్రమును జపింతురు.

౭

వాస్తుపరీక్షాపద్ధతి ప్రతిపాదింపఁ బడుచున్నది; గృహమేధికి గృహనిమిత్తముగా నభివృద్ధి వినాశములు సంభవించుచున్నవిగాన వాస్తుపరీక్ష ముఖ్యము. చవిటినేల వివాదాస్పదమైన భూమి యనుపాదేయము. ఓషధి వనస్పతులు గలది గ్రాహ్యము. దర్భ అవురుగడ్డి గలది గ్రాహ్యము. ముళ్ళచెట్లు, పాలవృక్షములు పెకలించివేయదగినవి. వాస్తుశాస్త్రమున నిషిద్ధములగు నుత్తరేణు, ఉసుచెట్టు, తెల్లలొద్దుగ, కొండగోగు మున్నగువానిని సమూలముగా పెకలించునది. నలువైపుల నున్నతముగ మధ్య పల్లముగ కొంచెము తూర్పున కేటవాలుగ నుండునట్లు భూమినేర్పరచి గృహనిర్మాణము సేయనగు. గృహమేధి శయనీయగృహము ప్రాగ్దిశయందుండనగు. శయనీయగృహము నుత్తరపార్శ్వముగా నీళ్ళు నిశ్శబ్దముగ ప్రదక్షిణముచేసి బైటకుఁబోవునట్లు కాలువనుగట్టవలయు. ఆశయనీయమునకుఁ బ్రాగ్భాగమున వంటయింటిని నిర్మించునది. ఆగ్నేయ భాగమున మహానసముంచుట లోకప్రసిద్ధమైనను బ్రాగ్దిశయందు సర్వసమృద్ధికరము. యజమానుడు స్వజనముతో గోష్ఠియొనర్పఁదగు శాల నుత్తరభాగమున నిర్మించినయెడ నది ద్యూతరహితయగు కాని, దానియందు క్రీడించు సంతాన మల్పాయుష్కమై మరణించును. మరియు వారు కలహప్రియులు, దంభపూరితులగుదురు. కావున నాశాల గృహమధ్యమున నేర్పరచునది. అట్లైన నది శుభప్రదమగుటయేగాక ద్యూతవర్జితమునునగు. ఇది బాహ్యపరీక్ష.

౮

ఆభ్యంతరపరీక్షయు జేయనగు. మోకాటి బంటిగుంటత్రవ్వి యామృత్తికచేతనే నయ్యది పూడ్చునది. పిదప నామట్టి గుంటపైకుబికిన ఎత్తుగానున్న ప్రశస్తము. నేలతో సమానముగనున్నచో జీవనోపాయముగలది యగును. తక్కువగానున్నచో నింద్యము. మరియు నాదిత్యుడస్తమించిన యనంతరమాగుంటయందు జలమునింపి ప్రభాతకాలమునఁ జూచునది; అప్పుడది నీటితో నిండియున్న ప్రశస్తము; ఆర్ద్రముగానున్న జీవనోపాయముగలది. ఎండిపోయియున్న నింద్యమగు. అచటి మృత్తిక తియ్యగనుండి యధికభాగము ఇసుక గలిగి యుండదగు. వర్ణములలో బ్రాహ్మణునకు శ్వేతవర్ణము, క్షత్రియునకు లోహితవర్ణము, వైశ్యునకు పీతవర్ణము ప్రశస్తము.

ఇట్లు పరీక్షింపఁబడిన నేల ననేక పర్యాయములు నాగలితో దున్ని సమచతు
రస్రముగాఁ జేయనగు. లేక తూర్పుభాగమున దీర్ఘముగ నున్న చతురశ్రము నైనను
జేయవచ్చు. పిదప శంతాతీయ సూక్తమును బఠించుచు ముమ్మారా ప్రదేశమును
బరిభ్రమించుచు జమ్మికొమ్మతోఁగాని, మోదుగ కొమ్మతోఁగాని ప్రోక్షించునది.
పిమ్మట నవిచ్ఛిన్న జలధారతో త్ర్యూచము నుచ్చరించుచు ముమ్మారు ప్రదక్షిణము
చేయనగు. అచట వేయఁదలచిన దూలములలో రెంటిరెంటి మధ్య కుడ్యాదులచే
నవాంతరగృహములు కట్టనగు. స్తంభముల గుంటలందు అవక (నాచు) ను, శీపాల
మును నిక్షేపించునది. వీని నుంచుటవలన నాయింటికి అగ్నిభయ ముండదని
శ్రుతివచనము. మధ్యమగర్తమందవకాశీపాలములనుంచిన పిమ్మట వానిపై కుశలను
ప్రాగగ్రములుగా, నుదగగ్రములుగాఁ బరచి వ్రీహియవలతో గూడిన జలమును సమం
త్రకముగాఁ బోయవలయు. ఆ గుంటయందు స్తంభమును నిలిపి రెండు మంత్రములతో
ననుమంత్రించవలయు.

౬

స్తంభములపైనుంచు దూలములు మంత్రించఁదగు, అనంతరము నాల్గు
శిలలనుంచి వానిపై కుశలను బరచి వానిపై మణికప్రతిష్ఠ మంత్రము నుచ్చరించుచు
చేసి, దానియందు సమంత్రకముగా జలమును పూరించునది. మణికమనగా భాండ
విశేషము.

ఇక వాస్తు శాన్తి యీరీతి చేయునది. వ్రీహియవ మిశ్రితమైన జలమునందు
బంగారమునుంచి శంతాతీయ సూక్తముతో ముమ్మారు ప్రదక్షిణముగాఁ దిరుగుచు
ప్రోక్షించునది. అవిచ్ఛిన్నజలధారతో త్ర్యూచము నుచ్చరించుచు ముమ్మారు తిరుగ
వలెను.

నట్టింట నూతనముగా స్థాలీపాకమును వండి నాల్గు ఋఙ్మంత్రములతో
నాల్గాహుతులను వేల్చి బ్రాహ్మణ భోజనము నిర్వర్తింపవలయు. పిదప వారిచే "శివం
వాస్తు" "శివంవాస్తు" అని యుచ్చరింప జేయవలయు.

మణికప్రతిష్ఠాపనము మొదలు "శివంవాస్తు" అను నంతవరకు గృహప్రవేశకర్మ నిర్దేశింపఁబడినది. మణికప్రతిష్ఠకుఁ బూర్వమే గృహమందు బీజములనుంచి మంత్రరహితముగా దానియందుఁ బ్రవేశింపదగు. ఉత్తరాభాద్ర, ఉత్తర ఫల్గుని, రోహిణి ఈ నక్షత్రములందు క్షేత్రమును దున్నించునది. అనుకూలమైన భూతలము నలికి యందగ్నిని ప్రతిష్ఠించి యొకసూక్తమందలి ప్రతి ఋక్కుచేత హోమముచేసి యాసూక్తమునే జపించవలయు. మేత్రైకె యరణ్యమునకు గోగణమేగునపుడు వచ్చునపుడును బ్రతిదినము ననుమంత్రణము సేయుచుండునది. ఆ గోగణము గురువునకు సంబంధించనిదైనచో ప్రతిదినము మంత్రముచే నుపస్థానము చేయుదగు. గురువునకు సంబంధించినదైన యెడల నుపస్థానము లేదు.

# తృతీయాధ్యాయము

౧

నిశ్శ్రేయస నిదానములగు పఞ్చయజ్ఞములు పేర్కొన బడుచున్నవి; దేవయజ్ఞము, భూతయజ్ఞము, పితృయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, మనుష్యయజ్ఞము, ఇవి పఞ్చయజ్ఞములనబరగు.

దేవయజ్ఞమునందగ్నిని ప్రతిష్ఠించి పది యాహుతులను వేయుదురు. భూతయజ్ఞమున బలివేయుదురు. పితృయజ్ఞమున బితృదేవతల కొసంగుదురు. ఈ యజ్ఞత్రయము వైశ్వదేవమునాబడు. బ్రహ్మయజ్ఞమున స్వాధ్యాయ మధ్యయనము చేయుదురు. మనుష్యయజ్ఞమున నతిథులకు భోజనమిడుదురు. ఈ పఞ్చయజ్ఞములకు తైత్తిరీయారణ్యకము మూలము. ఇవి ప్రతిదిన మనుష్ఠింపదగినవి కావున పరాన్నభోజనము ప్రాప్తించినను, ఉపవాసమున్నను, పచనముచేసి వీనినాచరింపవలయు. పచనము దుర్లభమైనపుడు పుష్పఫలాదులచే నైనను నిర్వర్తింపవలెను.

౨

స్వగ్రామమునుండి దూర్పునకు లేక యుత్తరమునకు వెడలి యటనది మున్నగువానియందు శిరస్స్నాన మాచరించవలెను. అటనొక పవిత్రప్రదేశమున యజ్ఞోపవీతియై కర్మాంగాచమనముచేసి పొడిగుడ్డలను కట్టునది. పిమ్మట దర్భలను ప్రాగగ్రము

లుగ బరచి వానిపై ప్రాఙ్ముఖముగా నాసీనుడై ఎడమ తొడపై నెడమ యఱచేతిని పైకి త్రిప్పియుంచి అందు పవిత్రద్వయమునుంచి దానిపై కుడియఱచేతితో కప్పునది. పిదప నేత్రములను మూసికొనిగాని తెఱచికొనిగాని యేకాగ్రమైన చిత్తముతో స్వాధ్యాయ మధ్యయనము చేయదగు. ప్రణవము, వ్యాహృతిత్రయము, సావిత్రి ఈ క్రమము ముందు చ్చరించునది.

3

తరువాత స్వాధ్యాయము, ఋక్కులు, యజుస్సులు, సామములు, అథర్వాంగిరస్సులు, బ్రాహ్మణములు, సూత్రములు, ఇంద్రాదిగాథలు, నారాశంసులను ఋగ్విశేషములు, ఇతిహాసమగు మహాభారతము, పురాణములు, వీని నధ్యయనము సేయనగు.

ఋక్కుల నధ్యయనము చేసినచో క్షీరాహుతులచేతనే తద్దేవతలను దృప్తి పొందించినట్లగును. ఇట్లే యజుస్సులవలన ఘృతాహుతులచేతను, సామములవలన మధ్వాహుతులచేతను, అథర్వాంగిరస్సులవలన సోమాహుతులచేతను, బ్రాహ్మణాదుల వలన నమృతాహుతులచేతను నాయాదేవతలను దృప్తిపొందించినట్లగు.

మరియు, ఋక్కులనధ్యయనముచేసినచో నవి పాలకాల్వలై పితృదేవతలకు స్వధాతృప్తిని గలిగించును. ఇట్లే యజుస్సులు నేతికాల్వలయి, సామములు తేనెకాల్వలయి, అథర్వాంగిరస్సులు సోమపుకాల్వలయి, బ్రాహ్మణాదులు అమృతంపుకాల్వలై పితృదేవతలకు స్వధాతృప్తి గలిగించును. స్వధయన పితృదేవతలయన్నము.

బ్రహ్మయజ్ఞమున ఋగాదులగు నీపదింటిని తప్పక చదువవలయుననను నియమము లేదు. ఎంతవరకు చిత్తమేకాగ్రముగనుండునో యంతవరకే యధ్యయనము సేయునది. అధ్యయనాంతమున "నమోబ్రహ్మణే" యను ఋక్కును మువ్మారు పరిధానము సేయవలయు.

४

పరిధానానంతరము ప్రజాపతి, మున్నగు నిరువదితొమ్మిది వాక్యములు చ్చరించుచు దేవతా తర్పణము సేయుదురు. శతర్చిమున్నగు పండ్రెండుమంది ఋషులకు నివీతముగా తర్పణముసేయుదురు. ఇరువదిమూడువాక్యములను పఠించుచు ప్రాచీనావీతముగా స్వాచార్యతర్పణముచేసి పితృపితామహ ప్రపితామహులకు తర్పణము గావించుదురు.

మణికప్రతిష్ఠాపనము మొదలు "శివంవాస్తు" అను నంతవరకు గృహప్రవేశనకర్మ నిర్దేశింపఁబడినది. మణిక ప్రతిష్ఠకుఁ బూర్వమే గృహమందు బీజములనుంచి మంత్రరహితముగా దానియందుఁ బ్రవేశింపదగు. ఉత్తరాభాద్ర, ఉత్తర ఫల్గుని, రోహిణి ఈ నక్షత్రములందు క్షేత్రమును దున్నించునది. అనుకూలమైన భూతలము నలికి యందగ్నిని ప్రతిష్ఠించి యోగసూక్తమందలి ప్రతి ఋక్కుచేత హోమముచేసి యాసూక్తమునే జపించవలయు. మేతకై యరణ్యమునకు గోగణమేగునపుడు వచ్చునపుడును బ్రతిదినము ననుమంత్రణము సేయుచుండునది. ఆ గోగణము గురువునకు సంబంధించనిదైనచో ప్రతిదినము మంత్రముచే నుపస్థానము చేయుదగు. గురువునకు సంబంధించినదైన యెడల నుపస్థానము లేదు.

# తృతీయాధ్యాయము

౧

నిశ్శ్రేయస నిదానములగు పఞ్చయజ్ఞములు పేర్కొన బడుచున్నవి; దేవయజ్ఞము, భూతయజ్ఞము, పితృయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, మనుష్యయజ్ఞము, ఇవి పఞ్చయజ్ఞములనబరగు.

దేవయజ్ఞమునందగ్నిని ప్రతిష్ఠించి పది యాహుతులను వేయుదురు. భూతయజ్ఞమున బలివేయుదురు. పితృయజ్ఞమున బితృదేవతల కొసంగుదురు. ఈ యజ్ఞత్రయము వైశ్వదేవమునాబడు. బ్రహ్మయజ్ఞమున స్వాధ్యాయ మధ్యయనము చేయుదురు. మనుష్యయజ్ఞమున నతిథులకు భోజనమిడుదురు. ఈ పఞ్చయజ్ఞములకు తైత్తిరీయారణ్యకము మూలము. ఇవి ప్రతిదిన మనుష్ఠింపదగినవి కావున పరాన్నభోజనము ప్రాప్తించినను, ఉపవాసమున్నను, పచనముచేసి వీనినాచరింపవలయు. పచనము దుర్లభమైనపుడు పుష్పఫలాదులచే నైనను నిర్వర్తింపనగు.

౨

స్వగ్రామమునుండి దూర్పునకు లేక యుత్తరమునకు వెడలి యటనది మున్నగువానియందు శిరస్నాన మాచరించనగు. అటనొక పవిత్రప్రదేశమున యజ్ఞోపవీతియై కర్మాంగాచమనముచేసి పొడిగుడ్డలను కట్టునది. పిమ్మట దర్భలను ప్రాగగ్రము

లుగ బరచి వానిపై ప్రాఙ్ముఖముగా నాసీనుడై ఎడమ తొడపై నెడమ యఱచేతిని పైకి త్రిప్పియుంచి అందు పవిత్రద్వయమునుంచి దానిపై కుడియఱచేతితో కప్పవది. పిదప నేత్రములను మూసికొనిగాని తెఱచికొనిగాని యేకాగ్రమైన చిత్తముతో స్వాధ్యాయ మధ్యయనము చేయదగు. ప్రణవము, వ్యాహృతిత్రయము, సావిత్రి ఈ క్రమము ముందు చ్చరించునది.

3

తరువాత స్వాధ్యాయము, ఋక్కులు, యజుస్సులు, సామములు, అధర్వాంగిరస్సులు, బ్రాహ్మణములు, సూత్రములు, ఇంద్రాదిగాధలు, నారాశంసులను ఋగ్విశేషములు, ఇతిహాసమగు మహాభారతము, పురాణములు, వీని నధ్యయనము సేయునగు.

ఋక్కుల నధ్యయనము చేసినచో క్షీరాహుతులచేతనే తద్దేవతలను దృప్తి పొందించినట్లగును. ఇట్లే యజుస్సులవలన ఘృతాహుతులచేతను, సామములవలన మధ్వాహుతులచేతను, అధర్వాంగిరస్సులవలన సోమాహుతులచేతను, బ్రాహ్మణాదుల వలన నమృతాహుతులచేతను నాయాదేవతలను దృప్తిపొందించినట్లగు.

మరియు, ఋక్కులనధ్యయనముచేసినచో నవి పాలకాల్వలై పితృదేవతలకు స్వధాతృప్తిని గలిగించును. ఇట్లే యజుస్సులు నేతికాల్వలయి, సామములు తేనెకాల్వలయి, అధర్వాంగిరస్సులు సోమపుకాల్వలయి, బ్రాహ్మణాదులు అమృతంపుకాల్వలై పితృదేవతలకు స్వధాతృప్తి గలిగించును. స్వధయన పితృదేవతలయన్నము.

బ్రహ్మయజ్ఞమున ఋగాదులగు నీపదింటిని తప్పక చదువవలయునను నియమము లేదు. ఎంతవరకు చిత్తమేకాగ్రముగనుండునో యంతవరకే యధ్యయనము సేయునది. అధ్యయనాంతమున "నమోబ్రహ్మణే" యను ఋక్కును ముమ్మారు పరిధానము సేయవలయు.

౪

పరిధానానంతరము ప్రజాపతి, మున్నగు నిరువదిలొమ్మిది వాక్యములు చ్చరించుచు దేవతా తర్పణము సేయుదురు. శతర్చిమున్నగు పండ్రెండుమంది ఋషులకు నివీతముగా తర్పణము సేయుదురు. ఇరువదిమూడువాక్యములను పఠింపుచు ప్రాచీనావీతముగా స్వాచార్యతర్పణముచేసి పితృపితామహ ప్రపితామహులకు తర్పణము గావించుదురు.

పిమ్మట గృహమునకేతెంచి యొనరించు నతిథిభోజనము భిక్షాదానము మున్నగునవి బ్రహ్మయజ్ఞాంగమగు దక్షిణ యగుచున్నవి.

గృహమేధి నిలుచుండిగాని నడచుచుగాని యాసీనుండైగాని శయనించిగాని యేయే క్రతుభాగము నధ్యయనము చేయుచున్నాడో యాయా క్రతువుచే గృహమేధికి బ్రహ్మయజ్ఞఫలము సిద్ధించును.

సూతక ప్రేతక మలాదులచే నశుచియైనపుడు పవిత్రప్రదేశము దుర్లభమైనవుడు మాత్రము బ్రహ్మయజ్ఞమున కనధ్యయన సమయములు.

౫

బ్రహ్మయజ్ఞము నిత్యముగాన నిప్పుడధ్యాయోపాకరణము చెప్పబడుచున్నది. ఈ కర్మయందధ్యయనము ప్రారంభింపబడును. ఓషధులు మొలచునపుడు శ్రావణ మాసమునందు శ్రవణ నక్షత్రకాలమందుగాని శ్రావణమాసమునందు పంచమీతిథి హస్తనక్షత్రముతోగూడి యుండునపుడుగాని యధ్యాయోపాకరణము చేయదగినది. శ్రావణమాసమున నోషధులంకురింపక పోయినయెడల భాద్రపదమాసమున శ్రవణ నక్షత్రకాలమందు చేయునది.

అగ్నియందాజ్యభాగాన్త కర్మనొనరించి, సావిత్రి, బ్రహ్మ, శ్రద్ధ, మేధ, ప్రజ్ఞ, ధారణ, సదసస్పతిఅనుమతి, ఛందస్సులు, ఋషులు, వీనినుద్దేశించి యాజ్యాహుతులు వేల్చునది. పిమ్మట నేకఋగాహుతి, దధిమంథముతో వేల్చునది.

అధ్యయనము సేయువాడు పూర్వోక్తములగు నిరువది తొమ్మిది యాహుతులను వేల్చి స్విష్టకృత్తుతో హోమముచేసి దధిమంథమును ప్రాశనముచేసి మార్జనము గావింపవలయును. పిమ్మట దానగ్నికి పశ్చిమభాగమున ప్రాగగ్రములుగ బరచిన దర్భలపై నాసీనుడై శరావాది పాత్రమునందుదకముంచి దర్భలనుంచవలయు. అనంతరము బ్రహ్మాంజలిఘటించి, శిష్యులున్నచో వారితోగూడ మంత్రముల నుచ్చైస్స్వరముతో బలుకఁదగు. ఓంకారము. వ్యాహృతిత్రయము, సావిత్రి వీనిని క్రమముగా ముమ్మారభ్యసించి వేదారంభణము సేయునది. తరువాత సర్వప్రాయశ్చిత్తాదులతో హోమ సమాప్తి గావించునది. ఈరీతిగా నుత్సర్గమందును నాచరించునది. కాని ప్రాశనమార్జనములిందుండవు. ఉపాకరణమైన పిమ్మట నాలుమాసములు విడువకుండ వేదాధ్యయనము చేయవలయు.

స్నాతకుడును బ్రహ్మచారి ధర్మములతో నధ్యయనము చేయవచ్చు. కాని వీనికి మేఖలాదులుండవు. బ్రహ్మచారులందఱు నీ యధ్యయనము చేయునది.

కొందఱు సమావర్తనమైన తరువాత భార్యను పొందవలయునందురు. అట్లు భార్యను పొందువాడు ఋతుకాలమందే పొందవలయు. భార్యాగమనమ్ము సంతాన నిమిత్తము గావున నితర కాలము నిషిద్ధము. ఈ యుపాకరణమునకు వార్షికమనియు వ్యవహారముగలదు. మాఘమాస పౌర్ణమాసియందు బూర్వోక్త దేవతలనుద్దేశించి గృహసిద్ధాన్నముచే హోమముచేసి స్విష్టకృద్ధోమముచేసి వేదారంభముచేసి పిమ్మట హోమశేషము బూర్తిసేయునది. తదనంతరము జలమందవగాహనస్నానమాచరించి స్వాధ్యాయమునందుక్తమైనరీతి సావిత్రి మున్నగు దేవతలనుద్దేశించి యిరువది తర్పణములుచేసి బ్రహ్మయజ్ఞమునందుక్తమైనట్లు దేవర్షి పితృతర్పణము లొనరింపదగు. ఇది యుత్సర్గము. పిమ్మట షడంగాధ్యయనము షణ్మాసములందభ్యసింపదగు.

౬

శ్రౌత సూత్రమున నగ్నిత్రయ సాధ్యములు కామ్యములు నగునిష్టులు, పశువులు కొన్ని పేర్కొనబడినవి. వాని నీగృహ్యాగ్నియందు గామ్య పాక యజ్ఞములుగా నాచరింపవచ్చు. కాని కామ్యసోమమునకీ గృహ్యాగ్నియందవకాశము లేదు. శ్రౌతమునందుక్తములైన పురోడాశములకుబదు లిందు చరువులు ప్రకల్పనీయములు. కాని పశువునకు బ్రతినిధి చరువులేనందున పశు వేగ్రాహ్యము. ఇట్లుచేసి శ్రౌతోక్తములగు కామములను పొందవచ్చు. పాకయజ్ఞము లాహితాగ్నికి ననాహితాగ్నికిని గర్తవ్యములైనను నీకామ్యపాక యజ్ఞములు మాత్రమనాహితాగ్నికేయని యెరుంగునది.

ఇక నైమిత్తికములు—జ్వరాదిగ్రస్తునకు, మంచమెక్కినవానికి, క్షయరోగికి, షడాహుతి యను నెడు చరువు కర్తవ్యము. అశుభస్వప్నముగాంచెనేని యేడు ఋక్కులతో సూర్యోపస్థానము చేయుదురు. తుమ్ము, ఆవులింత, అప్రియదర్శనము, దుష్టగంధాఘ్రాణము, నేత్రస్పందనము, కర్ణధ్వని, ఈ యాఱింటియందు నొక ఋక్కును పఠింతురు. ఋతువుగాని యపుడు స్వభార్యాగమనము చేసినను, యాజ్యార్హుడు కానివానిచే యాగముచేయించినను, భుజింపరానిదానిని భుజించినను, గ్రహింపగూడని వస్తువును గ్రహించినను, అగ్నిచయనమందున్న యూపస్తంభమును ముట్టినను, రెండు ఋక్మంత్ర

ములతో రెండాజ్యాహుతులను వేల్చుదురు. లేక యాఋగ్ద్వయముచే సమిదాధానము గాని జపముగాని చేయుదురు.

౭

వ్యాధిలేనివాడు నిద్రపోవునపుడు సూర్యుడస్తమించెనేని లేచి మౌనము దాల్చి నిలబడి రాత్రిశేషము గడపి సూర్యోదయమైన యనంతరమైదు ఋక్కులచే సూర్యోపస్థానము చేయునది. అవిహితకర్మలను నాట్యాదులచే శ్రాన్తుడై నిద్రించుచుండగా సూర్యోదయమయ్యెనేని ఆ పగలంతయు మౌనముదాల్చి నిలబడి గడపి మరునాడు సూర్యోదయమైన తరువాత నాల్గు ఋక్కులచే సూర్యోపస్థానము సేయునది.

నిత్యకర్మవిధి—యజ్ఞోపవీతియై మార్జనాదికము చేసికొని, వాఙ్నియమము కలవాడై సంధ్యోపాసన మాచరింపదగు. సాయంకాలమున వాయవ్యాభిముఖుడై సూర్యమండలము సగము క్రుంకినది మొదలు నక్షత్రదర్శనపర్యంతము సావిత్రీజపము చేయనగు. ప్రాతఃకాలమందు ప్రాఙ్ముఖుడై నిలబడి నక్షత్రములు సగమస్తమించినదిమొదలు సూర్యమండల దర్శన పర్యంతము సావిత్రీజపము చేయనగు.

రక్తపాదములు శుక్లవర్ణము గలిగి యరణ్యమందు సంచరించు కపోతము గృహముపై వ్రాలినను, గృహసమీపముగా నేగినను, "దేవాః కపోత" అను సూక్తములోని ప్రతి ఋక్కుచే హోమము చేయనగు. లేదా యాసూక్తము జపింపనగు. ప్రయోజనము నపేక్షించి వెళ్ళునపుడు "వయముత్వా పథస్పతే" అను సూక్తములోని ప్రతి ఋక్కుతో హోమముగాని యాసూక్తజపముగాని చేయఁదగు. పోయిన వస్తువును వెదక వెళ్ళువాడుగాని, ప్రజ్ఞాశూన్యుడుగాని "సంపూషన్ విదుషా" అను సూక్తముచే హోమముగాని జపముగాని చేయనగు. దీర్ఘప్రయాణము చేయదలచినపుడుగాని అల్పమార్గమైనను భయము నాశంకించినపుడుగాని "సంపూషన్నధ్వనే" యను దానిచే హోమముగాని జపముగాని చేయునగు.

౮

సమావర్తన సంస్కారమునందువాడు మణి, కుండలములు, వస్త్రద్వయము, గొడుగు, చెప్పులు, కఱ్ఱ, పూలదండ, నలుగుపిండి, మైపూత, కాటుక, తలగుడ్డ, ఈ పదనొకంటి తనకు, గురువునకును సంపాదింపవలయును. ఇద్దరికిగా నవి సంభవింపనపుడు

తనకుమూని గురువునకైనను సంపాదించునది. యజ్ఞార్హమైన వృక్షమునందలి యీశాన్య శాఖనుండి సమిధను తెచ్చి సమిదాధానసమయమున నుపయోగించునది. ఈ సమిధను అన్నాదికమును, పుష్టిని, తేజస్సును గోరువాడుఁ బచ్చిదానినిఁ, బ్రహ్మవర్చస్సును గోరువాడు ఎండినదానిని, పూర్వోక్తములగు నాల్గుఫలములను గోరువాడు సులివచ్చిదానిని తేవలయు. ఆ తెచ్చిన సమిధను నెత్తైన ప్రదేశమున నుంచునది. నేలపై నుంచరాదు.

తరువాత బ్రాహ్మణులకు గోవును దక్షిణగానొసగి వారికి గర్భాంగముగా భోజనమిడి పూర్వోక్తమైన గోదానకర్మోక్త కర్మమాత్రమిట నాచరించునది. దానిని నియములిందులేవు. ఈ కర్మ స్వయముగానే యాచరించునది. గోదాన మంత్రములంద స్మచ్ఛబ్దము నూహచేసి యిట నుపయోగించునది. పులిగోరు చెట్టుకాయలలో నేక బీజముగలదానిని దెచ్చినూరి నలుగు పెట్టించుకొనవలయు. గోరువెచ్చని నీటితో స్నాన మాచరించి, సమంత్రకముగా దొలుత నెడమకంటికి, నవంతరము కుడికంటిని గాటుక బెట్టించుకొనదగు. సమంత్రకముగా సువర్ణకుండలములను ధరింపవలయు. మైపూత చేతులకు బూసికొని గాత్రములందనులేపనము చేసికొనదగు. కాని బ్రాహ్మణుడు ముఖమునకు, రాజన్యుడు బాహువులకు వైశ్యుడుదరమునకు స్త్రీ గుహ్యమునకు శ్రమజీవి తొడలకు ప్రథమముగా నారంభించనగు. సమస్త్రికముగా బూలదండను, పాదరక్షలను, ఛత్రిమును, వెదురుకఱ్ఱను, కంఠమునందు మణిని, ధరించి, తలగుడ్డను తలకుచుట్టి నిలుచుండి సమిదాధానము చేయవలయు.

౯

స్నాతకుడు గొన్ని మంత్రములను బఠింపవలయు, కూర్చుండి ఒక సూక్తముచే బదిసమిధలగ్నియందుంచి స్విష్టకృదాది హోమశేషమును బూర్తిగావించునది. స్నాతకుడు తనకు మధుపర్క పూజ జరుగుచోట నారాత్రి నివసింపనగు, స్నాతకుడు విద్యాగ్రహణాంతమున గురువునకేది కావలయునో యడుగవలయు. గురువపేక్షించిన ద్రవ్యము చ్చి సమావర్తనము గావించుకొనవలయు. లేదా గుర్వనుజ్ఞాతుడై స్నాతకుడు కావచ్చును.

స్నాతకుడీ నియమములు పాటింపదగినవి. రాత్రియందుగాని వివస్త్రుడైగాని స్నానము చేయరాదు. వివస్త్రుడై శయనింపజనదు. వివస్త్రగానున్న వనితచూడదగదు. మైధునసమయమున నీ నిషేధములేదు. ప్రాణాపాయకరములగు పనులెవ్వియు జేయ

రాదు. మఱియు ప్రాణాపాయకరముగ నున్నపుడు వర్షములో శీఘ్రముగ నడచుట, వృక్షముల నధిరోహించుట బావిలోదిగుట, నదిలోనీదుట మున్నగునవి చేయరాదు.

౧౦

స్నాతకుడు స్వాచార్యుని వీడునపుడభివాదనము సేయవలయు. అందు గురు నామధేయము పెద్దగానుచ్చరించి తరువాత మెల్లగా దాను స్వీకరింపబోవు నాశ్రమము వినిపింపదగు. స్నాతకుడు రెండు మంత్రములను మెల్లగా బఠింపగా నాచార్యుడును వానిని మెల్లగా జపించును. ఆచార్యుడు "ఓంప్రాక్ స్వస్తి" అను మంత్రము నుచ్చరించి శిష్యున కనుమతి నొసంగును. ఇట్లను జ్ఞాతుడైనవాని కెందును భయములేదని వేదము పలుకు చున్నది.

అప్రియములగు పిట్టకూతలు వినబడ్డేనేని రెండుసూక్తములు పఠించునది. అప్రియములగు మృగధ్వనులు వినబడ్డేనేని ఒక ఋక్కును జపించునది. పురుషుని వలనగాని, క్రూరమృగముల వలనగాని యేదిక్కునుండి భయము నాశంకించునో యావైపున, రెండువైపుల నుండుచున్న కాష్ఠము నొకదానిని సమంత్రకముగా నుంచునది. లేదా కవ్వమును అప్రదక్షిణముగా పఠించి దానిని భయాస్పదమగు దిక్కున కభిముఖగా వంచి పుచ్చుకొనవలయు.

౧౧

అన్నిదిక్కులనుండి భయమున్నదని తోచియు నది యెవరివలన గలుగు నదియు దెలియనపుడు లౌకికాగ్నియం దెసిమిదాజ్యాహుతులు వేల్చవలయు. ఈశాన్య భాగమందుండి స్వస్తిసూక్తము జపింపనగు. పిమ్మట సర్వప్రాయశ్చిత్తాదులచే హోమ శేషమును పూర్తిగావించునది. ఇది యంతయు స్నాతకునిని వదలునపుడు చేయదగి నదిగా భావించునది.

౧౨

సంగ్రామము సంభవించి నపుడు పురోహితుడు రాజు నీ రీతిగా సన్నద్ధుని గావించును.

పురోహితుడు రథము వెనుకవైపుననుండి ఒక సూక్తమును పఠించును, కవచమునిచ్చుచు "జీమూతస్యేవభవతి" అను సూక్తములోని ప్రథమఋక్కును జపించును. రెండవ ఋక్కుచే వింటి నందించును. మూడవ ఋక్కును రాజుచే బఠింపజేయును. తాను నాల్గవఋక్కును జపించును. ఐదవఋక్కుచే తూణీరము నిచ్చును. ఆఱవ

ఋక్కును రథము కదలుచుండగా జపించును. ఏడవఋక్కుచే నశ్వముల నభిమంత్రించును. ఎనిమిదవ ఋక్కును రాజు, బాణములను జూచుచుండ రాజుచే బఠింపజేయును. ముంజేతికి గవచము కట్టునపుడొక ఋక్కును, రథము వెళ్ళుచుండగా దాను రథమెక్కి మఱియొక సూక్తమును రాజుచే బఠింపజేయును. పిమ్మట రాజును జూచుచు నప్రతిరథ సూక్తమును శాససూక్తమును సౌపర్ణసూక్తమును బఠించును. అనంతరము రాజు క్రమముగా నన్నిదిక్కులను చుట్టివెళ్ళనగు. రాజు పగలాదిత్యుడున్నవైపు రాత్రియందు శుక్రుడున్నవైపుననుండి యుద్ధము సేయుటలెస్స. కావున సూర్యాభిముఖముగా శుక్రాభిముగా యుద్ధమాచరింప గూడదు. రాజు దుందుభిని సమంత్రకముగా తాకి సమంత్రకముగా బాణములను విడుచునది. రాజులు పోరు సల్పునపుడు పురోహితుడు మంత్రము పఠించును.

లేదా పురోహితుడు పై విధానమంతయు రాజునకు బోధించును.

# చతుర్థాధ్యాయము

## ౧

ఆహితాగ్ని వ్యాధి పీడితుఁడైనచో నతఁడు తనయగ్ని త్రయముతో గ్రామము నుండి బయలు వెడలి గ్రామమునకుఁ దూర్పునగాని యుత్తరమునగాని, ఈశాన్యమున గాని యారోగ్యము చెందునంతవఱకు నివసించఁదగు. అగ్నులు గ్రామనివాసమునందుఁ గోరికగలవి గావున నవి మరల గ్రామమును పొందుట కభిలషించుచున్నవై యాహితాగ్ని నారోగ్యవంతుఁగా నాశీర్వదించుచు రోగములేని వానినిగాఁ జేయునని వేద వేత్తలు చెప్పుచున్నారు. వ్యాధిరహితుఁడై యగ్నిష్టోమముచేత నైంద్రాగ్న పశువుచేతను పౌర్ణమాస్యిష్టిచేతను దేవతలనుయజించి గ్రామమునఁ బ్రవేశింపనగు. యాగముంజేయకయు ప్రవేశింపవచ్చు.

ఆహితాగ్ని మరణించినచో నాగ్నేయ భాగమునగాని నైరృత భాగమునగాని భూభాగమును గొంత త్రవ్వనది. ఆగర్తము దక్షిణము పల్లముగాగాని ఆగ్నేయము పల్లముగాగాని యుండునది. పొడవు చేయెత్తిన పురుషుని ప్రమాణముగా నుండునది, బార వెడల్పుండునది. జేనెడు లోతుండునది. దహనదేశ రూపమైన దొక శ్మశానము, నగ్ని సంచయనముచేసి పోయునదొక స్మశానము. ఈ రెంటికి మధ్య నవకాశము గూడదు. ఈ రెండు శ్మశానములోషధి బాహుళ్యము గలిగి యుండనగు.

వాస్తు పరీక్షయందుఁ జెప్పినట్లు కంటకవృక్షాది శూన్యముగా నుండవగు. మరియు వని
మధ్య నెత్తుగా చుట్టు పల్లముగానుండి చుట్టు నీరు దొర్లిపోవునట్లుండవలయు. దీక్షిత
మరణమందుఁ జెప్పఁబడినట్లు ప్రేతాలంకారములను, కేశ, శ్మశ్రు, రోమ, నఖ, వాపనము
వట్టివేళ్ళ పిండి మొదలైనవి చేయఁదగు. అధికముగా బర్హిస్సులను నాజ్యమును పృష
దాజ్యమును సిద్ధము చేయునది. దధి యందాజ్యముఁ గలిపినచో నయ్యది పితృకర్మోప
యోగియగు పృషదాజ్యమగును.

ఎచ్చట భూభాగము త్రవ్వఁబడినదో యా దిక్కుగా నగ్నులను యజ్ఞపాత్ర
ములను బంధువులు తీసికొని పోవుదురు. యజ్ఞపాత్రముల వెనుక ప్రేతమును గొం
పోవుదురు. తీసికొనిపోవువారు బేసిసంఖ్యగలిగి వృద్ధులుగా నుండవలయు. స్త్రీలు పురు
షులు కలియఁగూడదు. కొందరీప్రేతము నెడ్లబండిలో తీసికొని పోవలయునందురు.
కొందరను స్తరణపశువునుగూడ తీసికొని పోవుదురు. ఆ పశువు గోవు కావచ్చును.
లేదా ఒక వర్ణముగల యాడుమేక గావచ్చును. కొందరు నల్లమేక గావలెనందురు.
బంధువులాపశువు ముందటి యెడమ కాలికి త్రాడుగట్టి తీసికొనిపోవుదురు. ప్రేతమునకు
వెనుక భాగమున దగ్గఱి బంధువు లుత్తరీయమును నడుమునకుగట్టి యజ్ఞోపవీతములను
నడుమునకుఁ జుట్టి విముక్తశిఖులై జ్యేష్ఠానుపూర్వ్యముగా పోవుదురు. దహనము చేయు
వాఁడు పూర్వోక్తభూభాగమును బొంది జమ్మికొమ్మగైకొని గుంటలోని నీటిచే
ముమ్మారుప్రదక్షిణముగ గుంటచుట్టు తిరుగుచు సమంత్రకముగా ప్రోక్షించును. ఈ నీటి
గుంట అచటనుంచబడు ఆహవనీయ స్థానమున కీశాన్యభాగమున త్రవ్వి నీళ్ళుపోసి
యుంచవగు. ఆగ్నేయభాగమున నాగుంటలోఁ జివరావహనీయాగ్ని నుంచును. వాయ
వ్యమున గోతిచివర గార్హపత్యాగ్నిని నైరృతమున దక్షిణాగ్ని నుంచును. బాగుగా తెలి
సినవారు ఇధ్మరూపమైనయగ్ని నా యగ్నులకు మధ్యభాగమున నుంచుదురు. ఈ
యిధ్మాగ్ని నిక్షేపణమునకు ముందాగుంటయందు హిరణ్యశకలమునుంచి తిలలను జల్ల
వలయు. పిమ్మట కర్తచితిపై బర్హిస్సులనుపరచి దానిపై కృష్ణాజినమును పఱచగా దాని
యందు బంధువులు గార్హపత్యాగ్నికి నుత్తరముగా నావహనీయమున కభిముఖశిర
ముగా పరుండఁబెట్టెదరు, ప్రేతపత్నిని ప్రేతమున కుత్తర భాగమందు పరుండబెట్టెదరు.
ప్రేతము క్షత్రియుడైనచో ధనస్సునుగూడ నుంచవలయు. పిదప పతిస్థానీయుఁడు మఱఁది
ధూమెను లేపును. లేక శిష్యుఁడుగాని । లేక ముదుసలియైన దాసుఁడుగాని సమంత్రక
ముగా లేపును. ఇట్లే సమంత్రకముగా ధనస్సును తీసివేయవలయును,

హిరణ్య శకలములచే ప్రేత శిరమందలి యేడింద్రియ రంధ్రములను గప్పి ఘృత సిక్తములైన తిలలను ప్రేతముపైఁ జల్లవలయును. పిమ్మట యజ్ఞపాత్రలను ప్రేతమునందుఁ గూర్పవలయు. ప్రాకృతయజ్ఞమగు నగ్న్యాధేయమందుత్పన్నమైన పాత్రములను గూర్పవలయు. వికృతి యాగము మధ్య చనిపోయినచో వికృతి పాత్రలను గూడ గూర్పవలయు. దక్షిణ హస్తమున జుహువును, ఎడమచేతిలో నుపభృత్తును దక్షిణపార్శ్వమునస్ఫ్యమును, ఎడమప్రక్క నగ్నిహోత్రహవణిని, వక్షమున ధ్రువను, శిరమున కపాలములను, దంతములందు గ్రావములను, నాసాపుటములయందు స్రువములను, ఒకే స్రువమైనచో విఱిచిన రెండు తుంపులను, కర్ణములందు ప్రాశిత్రహరణములను, ఒకటైనచో రెండుగా విఱిచియు ఉదరమునందు పాత్రిని సమవత్తధానమగు చమసమును, ఊరువుపై భాగమున శమ్యను, పాదములందు శూర్పమును, ఒకటైనచో చింపియు, నింకేమియైన మిగిలినచో యథేష్టముగా వానిని ప్రేతమందు గూర్పవలయు. పృషదాజ్యము నిలచుటకు వీలున్నచో నాయా పాత్రములయందు పృషదాజ్యమును నింపవలయు. దృషదుపలము మాత్రము పుత్రుఁడు తనవద్దనుంచుకొనవలె. సింది గనుక నది యింటనుండి తీసికొనిరాదగదు. ఇట్లే కౌలాలమను లోహాయసపాత్రము-అనుస్తరణీయ పశువువపను ఛేదించి దానిని ప్రేతశిరస్సును ముఖమును సమంత్రకముగప్పును. వృక్కను దీసి ప్రేతహస్తములందు సమంత్రకముగా నుంచునది. దక్షిణ వృక్కను దక్షిణ హస్తమున నెడమవృక్క నెడమచేతియందు నుంచదగు. పశుహృదయమును ప్రేతహృదయముపైన సమంత్రకముగా నుంచునది. కొందరు పిండ్యములనుగూడ నుంచుదురు. వృక్క లేనప్పుడు పిండ్యములనుంచవలెనని కొందరందురు. ఈ పిండ్యముల ద్రవ్యమన్నముగాని సక్తువుగాని కావచ్చును. ఈ పిండ్యప్రసంగముచే నీలయనుస్తరణీయ పశువు వికల్పమని తెలియుచున్నవి. కావున నీ సక్తువుతోఁ బశురూపముగ తత్తదవయవకల్పనముచేసి యుంచవచ్చును. ఈ పక్షమునవపకుబదులపూపములను, వృక్కమునకుబదులు పిండ్యముల నుంచవలయు. అనుస్తరణీయపశుచర్మమును ప్రత్యేకముగా వేరుచేసి తక్కిన శరీరమునంతయు ఖండించకయే ప్రేతావయవానుగుణముగాఁ బశ్వవయవములనుంచి దానిపై చర్మమునుగప్పి యటనుంచి పూర్ణచమసమును మంత్రించవలయు. పిమ్మట ఎడమ మోకాలినిమాత్రము భూమికిదాకించి దక్షిణాగ్నియందాజ్యాహుతులను, అగ్ని, కాముఁడు, లోకుఁడు, అనుమతి, అను దేవలనుద్దేశించి నాల్గాహుతులను వేయవలయు.

ఐదవ యాహుతిని ప్రేతహృదయముపై నుంచవలయు. ఈ పంచమాహుతి నాహితాగ్నికి ననాహితాగ్నికిని వేయవచ్చు.

౮

కర్త దగ్గరన్నువారిని మూఁడగ్నుల నొకేసారి ప్రజ్వాలింపఁజేయుడని హెచ్చరించి యీరీతి విజ్ఞాపనసేయును. ఆవహనీయాగ్ని ఆహితాగ్ని శరీరము రు మొదట నంటుకొనునేని స్వర్గలోకమందీ యాహితాగ్నిని పొందించునని తెలియుడు. ఆహితాగ్ని స్వర్గలోకమందు సమృద్ధిని పొందఁగలడు. ఈరీతిగానీపుత్రుఁడు నీము స్వర్గలోకమున సమృద్ధిని పొందఁగలడని తెలియుడు. ఈ రీతిగా గార్హపత్యాగ్ని విషయమున నన్తరిక్షలోకము నుద్దేశించి దక్షిణాగ్ని విషయమున మనుష్యలోకము నుద్దేశించి విన్నపము చేయును. అన్ని యగ్నులొకేసారి యాహితాగ్నినిపొందినచో నాహితాగ్నికి విలక్షణమైన లోక ప్రాప్తియు నత్యుత్కృష్ట సమృద్ధియు కాగలవని బ్రహ్మవాదులు చెప్పుచుందురు. అనంతరము ప్రేషనిచ్చి చెరగుతో విసరుట మున్నగులౌకిక కర్మలొనరించి దహింపఁబడుచున్న ప్రేతముననుదగ్రవణ ఋక్కులచే ననుమంత్రించును.

ఈ యనుదగ్రవణ ఋక్కులిరువదినాలుగు. ఇట్లు మంత్రార్థవేత్తచే దహింపఁబడువాఁడు ధూమముతోడనే స్వర్గలోకమును పొందునని మంత్రవిదులు వచించుచున్నారు. ఆహవనీయాగ్ని కీశాన్యభాగమున మోకాటిబంటి గుంటఁద్రవ్వి యుందవలెను (నాచు) శీపాలము లుంచదగు. తరువాత నాహితాగ్ని దానినుండి బయలు దేరి ధూమముతోడనే స్వర్గలోకము పొందుచున్నాఁడని వేదము నొక్కి చెప్పుచున్నది. పిమ్మట నొక ఋక్కును జపించుచుండగా నందరు కలసి వెనుకకుఁదిరిగి చూడకుండ వెళ్ళి పోవునది. పిదప ప్రవహించని జలముగల తటాకము మున్నగు ప్రదేశమును బొందుదురు అచ్చట నాజలమందందరు నొకేసారి మునిగి లేచి యొక్కొక్క యుదకాంజలిని ప్రేత గోత్ర నామోచ్చారణ పూర్వకముగా నీయవలయు. ఇందు స్త్రీ పురుష భేదము లేదు. పిమ్మట వారుదకమునుండి బయటకువచ్చి ధౌత వస్త్రములను ధరించినవారై తడిగుడ్డలొకసారి మాత్రమేపిండి వాని నుత్తరాగ్రములుగా జారవిడిచి పట్టుకొని యెండింపదగు. నక్షత్ర దర్శనమగుటకుగాని కిరణవర్జిత సూర్యమండలము కనఁబడునంతవఱకుగాని యచ్చటనే యుండి తదుపరి గృహమును ప్రవేశింపవలయు. ఈ ప్రవేశము పిన్నలు ప్రథమముగఁ బెద్దలు తుదకు చేయునది. ఈ ప్రవేశనమునకు ముందు గృహప్రాంగణమున నున్న పాషాణము, అగ్ని, గోమయము, అక్షతలు, తైలము, జలము ఇవి స్పృశింపఁదగు.

ఆరాత్రి యింటివారు వంటచేయరాదు. కొన్న యన్నమునుగాని యింతకుఁ బూర్వమే వండఁబడిన యన్నమునుగాని భుజింపవలయు. ఇంట నున్నవారు మూఁడు రాత్రులు క్షౌర, లవణవర్జిత భోజనము భుజింపనగు మహా గురువులు మృతులైనచో పండ్రెండు రాత్రులుగాని పది రాత్రులుగాని దానాధ్యయనములు వర్జించునది. తలిదండ్రులును, ఉపనయనముఁ జేసి సంపూర్ణ వేదోపదేశముఁ జేసినవాఁడును మహాగురువులగుదురు. సపిండులు, వివాహముగాని స్త్రీలను మరణించినచో పదిరాత్రులు, అల్పముగా వేదము నుపదేశించిన గురువును, సమానోదకులైన జ్ఞాతులును, వివాహితులైనస్త్రీలు, దన్తములురాని స్త్రీలు మరణించిన మూఁడు రాత్రులు, నెలలు నిండక పూర్వము పోయినను త్రిరాత్రము. సహాధ్యాయి, సమాన గ్రామవాసియగు శ్రోత్రియుండు చనిపోయిన నొక రోజును, దానాధ్యయనములను వర్జింపవలయు, ఆశౌచవిధినిగుఱించి ధర్మశాస్త్రమున నెఱుఁగునది.

ఈ విధానమంతయు ననాహితాగ్నికిని కర్తవ్యమేగాని యాహితాగ్నికిగాఁ జెప్పిన యనుస్తరణ, యజ్ఞపాత్రసంయోగము, పృషదాజ్యము మున్నగునవి లేవు.

౫

కృష్ణపక్ష దశమితరువాత నసమతిథులగు నేకాదశి త్రియోదశి యమావాస్యలందు సంచయనము చేయఁదగు. ఏ పేరుతో నొకే నక్షత్రము చెప్పఁబడునో యా నక్షత్రమందు చేయఁదగు. కావున నాషాఢాద్వయము, ఫల్గునీద్వయము, ప్రోష్ఠపదాద్వయము కూడదు, అన్తర్దశాహామందుగాని, దశాహామతీతమైనవుడుగాని కృష్ణపక్షము వచ్చినప్పుడీవిధి యనుసరింపదగినది. అమంగళమై స్తనరహితమైన కుంభమున పురుషుని, అమంగళమై స్తనరహితమయిన కుంభియందు స్త్రీని, బేసిసంఖ్యగలవారు, దంపతులు గానివారు వృద్ధులస్థిసంచయనముఁ జేయవచ్చు. క్షీరమిశ్రోదకముచేతఁ గర్త శమీశాఖను గ్రహించి ముమ్మాఱప్రదక్షిణముగా నాయతనము చుట్టివచ్చి ఋక్కులతో ప్రోక్షించును. కర్త ప్రోక్షించుచుండగా నస్థులనేరు వారంగుష్ఠానామికలచే పాదాది శిరః పర్యంతమొక్కొక్క యస్థిని గ్రహించి నిశ్శబ్దముగా కుంభమందుంచవలయు. పిమ్మట భస్మమును చేటతో చెరిగి నూత్న్యస్థులను శిరము వైపున పోయుదురు. పిదప చుట్టు నాకాశము గలప్రదేశమున గుంటత్రవ్వి దానియందా కుంభము నుంచవలయు. కర్త ఋక్కులను పఠించుచుండును. ఆ గుంటలోపలకు వర్షోదకముతప్ప నితర జలంబులెవ్వియు క్రిందుగాగాని అడ్డముగాగానిస్రవింపరాదు. సమస్త్రికముగా నాగర్తమునందలి

కుండమూతివరకు మట్టిపోయుదురు. ఆ గర్తమును పూడ్చినపిదప మఱియొక ఋక్కును జపింతురు. పిమ్మట సమంత్రకముగా నొక కుండపెంకుతోఁ గుంభమునుగప్పి వెనుకకు చూడకుండవచ్చి శిరస్స్నాన మాచరింపవలయు. పిదప నా దినముననే శ్రాద్ధమును ప్రేతమునకు మాత్రమే యేకోద్దిష్ట విధానముగా నొనరింపవలయు.

౬

గురువు చనిపోయినవారు పుత్ర పశు హిరణ్యాదులు నశించినవారమావాస్య యందు శాన్తి కర్మ యనుదానిని చేయవలయు. మంత్రక్రియలను జ్యేష్ఠుడు చేయును. ఇతరులు దగ్గరనుందురు. ఆదిత్యోదయమునకు ముందగ్నిని భస్మముతో మేఖలాది సాధనములతో దక్షిణదిక్కుగా తీసుకొని పోవుదురు. ఆయగ్ని పచనాగ్నియేగాని, గృహ్యాగ్నిగాని యౌపాసనాగ్నిగానికాదు. ఈ రెండును యావజ్జీవ ధార్యములగుటచే వీనిని గ్రహింపరాదు. ఆ యగ్నిచతుష్పథమందుంచి యెడమ చేతితో తొడను కొట్టుకొనుచు ముమ్మాఱప్రదక్షిణముగా చుట్టుతిరుగుదురు. పిమ్మట వెనుకకుదిరిగి చూడకుండవచ్చెదరు. స్నానము చేసెదరు. కేశశ్మశ్రులోమనఖములను వపనము చేయించికొని మరల స్నానమాచరించుదురు. వక్ష్యమాణ ద్రవ్యములను నూతనముగా సిద్ధము చేయునది.

(1) జలమును పోయుటకు భాండములు మూడు, (2) కుంభములు మూఁడు (3) ఆచమనీయ సాధనములగు నుద్ధరిణి కమండలు మున్నగునవి మూఁడు మూఁడు (4) జమ్మిపూలదండలు మూఁడు (5) ఇధ్మ (ఇది పదునైదు జమ్మిపుల్లలకట్ట (6) జమ్మికఱ్ఱతోఁ జేయఁబడిన యరణులు (7) పరిధులు (ఇవియు పదునైదు జమ్మిపుల్లలు) (8) వృషభ గోమయము (9) చర్మము (10) నవనీతము (11) పాషాణము (12) గృహమందుగల స్త్రీలసంఖ్య ననుసరించి లేత దర్భలు. అపరాహ్ణకాలమందు అరణులఁ గైకొని సమంత్రకముగా మథనముఁజేసి యగ్ని నుత్పత్తి చేయునది. ఇది పచనాగ్ని నాబడుచున్నది. పిమ్మట నాయగ్నిని ప్రజ్వలింపఁ జేయుచు జీవించి యున్న వృద్ధుల గాథలను జెప్పికొనుచు మంగళకరములగు నితిహాస పురాణములను జెప్పికొనుచు రాత్రియందు జనులందరు మాటు మణిగి నిద్రించునంతవఱకు ఇంటికి వెలుపల కాలక్షేపముఁ జేయుదురు. ఇల్లు మాటు మణిగిన పిదపగాని లేక యర్ధరాత్రమునకు ముందుగాని యాత్మ బంధువులు గృహమందు, లేకశయనగృహమందు ప్రవేశింపఁదలంచినవారు కాగా, ఇంటిలో కర్త ద్వారమందు దక్షిణమునుండి యుత్తరము వైపునకు ఉదకధారను సమంత్రకముగా పోయును. పిమ్మట మఱియొక యౌపాసనాగ్ని నేర్పరచి దానికిఁ బశ్చిమ భాగమున బలీ

వర్ద చర్మమును ప్రాగ్గ్రీవముగాఁ బరచునది. కర్తదానిపై నమాత్యులను సమంత్రకముగా నధిష్ఠింపఁజేయును. కర్తగాక గృహమందు నిత్యము నివసించు దారపుత్రాదులమాత్యులనఁబడుదురు. అగ్నియందు ఆజ్యసంస్కారాంతముచేసి పశ్చిమ భాగమున సమంత్రకముగా పరిధి నుంచవలయు. దక్షిణోత్తర భాగములందమంత్రకముగ పరిధుల నుంచునది. పిమ్మట సమంత్రకముగా నగ్నికుదగ్భాగమున పాషాణమునుంచి నాల్గుముగాహుతులను వేల్చి, సమంత్రకముగా నమాత్యులను చూడవలయు. పిదప స్త్రీలు లేత దర్భలచే నవనీతముగ్రహించి అంగుష్ఠానామికలచే రెండు నేత్రములకు రెండు చేతులతో కాటుకగాఁ బెట్టుకొందురు ఆదర్భలను చూడకుండగా వెనుకవైపుగా విడుచుదురు. కర్త వారిని సమంత్రకముగాఁ జూచును. పిమ్మట కర్త సమంత్రకముగా పాషాణమును తాకును పిమ్మట యితరులు దాని నమంత్రకముగా స్పృశింతురు. అమాత్యులు అగ్నిచేతను బలీవర్ద గోమయముతోను "ఆపోహిష్ఠామయోభువః" అనుఋక్త్రయము నుచ్చరించుచు పోయుచున్న యవిచ్ఛిన్న జలధారతో ఔపాసనాగ్నిచుట్టు దిరుగుచుండగా కర్త యీశానదిగ్భాగమునుండి యొక మంత్రమును జపించును. పింగళవర్ణముగల బలీవర్దముచే ప్రదక్షిణము చేయింపదగినది. తరువాత స్విష్టకృదాదులతో నగ్నికర్మ పూర్తిగావించునది.

పిమ్మట వినోదముతో కాలము గడుపనెంచి యొకచోట నూతన వస్త్రమును పరచి సూర్యోదయము వఱకు జాగరణము చేయుదురు. సూర్యోదయమైన పిమ్మట సూర్య దేవతాక మంత్రములను స్వస్త్యయన మంత్రములను జపించి యగ్నియందాజ్యభాగాంతముచేసి యన్నమును సంస్కరించి యొక సూక్తముచే హోమము చేయునది. ఇఁట నన్నమటుకులవలె సంస్కార్యము. హోమశేషము పూర్తిచేసి యా యన్నముతోడనే బ్రాహ్మణులకు భోజనముపెట్టి వారిచే స్వస్తివాచనము చేయించవలయును. తరువాత గోవు, పానపాత్రము, నూతన వస్త్రము, యీ మూఁటిని దక్షిణగా నివ్వవలయు.

౭

ఇటుపైఁ జెప్పఁబోవు విధానము శ్రాద్ధార్హమైనది. శ్రాద్ధము నిశ్శ్రేయసప్రాప్తిసాధనము. శ్రాద్ధమును కర్శ పర్వమునందు చేయదగినది గాన నది పార్వణమనియు పిలువబడుచున్నది. పర్వములనగా నమావాస్య పౌర్ణమాసియని పూర్వోక్తము. పిండపితృయజ్ఞముతో నిది సమాన తంత్రముగలది గాన నీకర్మకమావాస్యయే గ్రాహ్యము.

పితృ దేవతల నుద్దేశించి బ్రాహ్మణులకొఱకు శ్రద్ధగా నియ్యఁబడుటచే నియ్యది శ్రాద్ధమైనది. ఈ పార్వణశ్రాద్ధము కామ్యము, ఆభ్యుదయికము, ఏకోద్దిష్టము అని త్రివిధము.

స్వాధ్యాయన సంపన్నులు, శమదమాది గుణయుక్తులు, క్రోధరాగాది దోష వర్జితులు, శాస్త్రకర్మల నాచరించుచు, నిషిద్ధ కర్మలను వర్జించువారునగు బ్రాహ్మణులను శ్రాద్ధమునందు గ్రహింపవలయు. లేక పై మూఁటిలో నొకగుణమున్నను చాలును. వారిని సకాలమున నిమంత్రణము చేసి స్నానము చేయించి పాదప్రక్షాళనము స్వయముగా నొనరించి ద్విరాచమనము నివ్వవలయు. వారి నుత్తరాభిముఖులుగా పితృ పితామహ ప్రపితామహార్థము బ్రాహ్మణవయఃపరిమాణము ననుసరించి జ్యేష్ఠోత్తరముగా కూర్చుండ బెట్టవలయు. ఇట నొక్కొక్క పితృదేవతాస్థానమున నొక్కొక్కరినిగాని, యిద్దరిద్దరిని గాని ముగ్గురు ముగ్గురుని గాని కూర్చుండ బెట్టవచ్చును. బ్రాహ్మణాధిక్యము ననుసరించి ఫలాధిక్యముగలదు. కావున ముగ్గురు నిమిత్త మొక్కరిని కూర్చుండబెట్ట జనదు. అన్నాభావమున నొక్కొక్కరిని వరింపవచ్చును. పిండ నిర్వాపణ ప్రకారము పిండపితృయజ్ఞోక్త విధానము గ్రాహ్యము,

బ్రాహ్మణులను కూర్చుండఁబెట్టి బ్రాహ్మణ హస్తమున నుదకము నియ్యవలయు. కర్త ఆగ్నేయ దిక్కున కభిముఖుడై ప్రాచీనావీతియై పితృకర్మ నాచరించునది. ముడిచిన దర్భలను బ్రాహ్మణుల యాసనమందియ్యవలయు. మరల నుదకము నివ్వవలయు, పిమ్మట యథాశక్తిగా లోహపాత్రము, రాతిచిప్ప, మట్టిపిడత, యీ మూఁటిని గ్రహించునది. లేక యొకే విధమైన మూఁడు పాత్రలను గ్రహించునది. వానిని బ్రాహ్మణుల యెదుట నాగ్నేయదిగంతముగా వరుసగానుంచి వానియందు దర్భలనుంచి యుదకముపోసి యాజలమును "శన్నో దేవీః" అను మంత్రముచే ననుమంత్రణము చేయునది. "తిలోసి" అను మంత్రముచే తిలలనుంచవలయు. ఈమంత్రమున పితృశబ్దమునకు పితామహ, ప్రపితామహయని యూహ లేదు. (ఇటఁ గొందఱు పండితులు "పితౄన్ పితామహాన్, ప్రపితామహాన్" అని యూహింతురు) ఆపాత్రములందు గంధమాల్యాదుల నుంచవలయు. పితృసంబంధికర్మ సర్వమపసవ్యముగా నాచరించునది. అర్ఘ్యము మాత్రము సవ్యపాణి ప్రకృతిస్థముతో నియ్యనగు. లేదా దక్షిణ హస్తమును సవ్య హస్తముతో గ్రహించి యుపవీతియై దక్షిణపాణితోడనే యర్ఘ్యమునీయందగు. ఈ యర్ఘ్య ప్రదానమునకు పిత్రాది త్రయమునకు మూఁడు మంత్రములు గలవు. ఈయర్ఘ్యమునకుఁ బూర్వము ప్రత్యేకోదకము నియ్యవలయు. ఈయర్ఘ్య ప్రదానమున అర్ఘ్యము

ప్రతి బ్రాహ్మణునుద్దేశించి "స్వధా అర్ఘ్యః" అను మంత్రముచే నివేదించదగు. పితృస్థానమునగల బ్రాహ్మణుల కందఱకు నొకపాత్రమే యుంచఁదగు. ఇట్లే పితామహస్థానమున ప్రపితామహస్థానమునను చేయునది. బ్రాహ్మణులచే విడువఁబడిన యర్ఘ్యోదకమును "యాదివ్యా ఆపః" అను మంత్రముచే ననుమంత్రించును. ఇట్లు ప్రతి బ్రాహ్మణుని కొసంగిన పిమ్మట రెండవ పాత్రోదకమును మూఁడవ పాత్రోదకమును మొదటి పాత్రలో కలిపి యా యర్ఘ్యశేషమును కర్త పుత్రకాముఁడైనచో ముఖమున కద్దుకొనును. ఈయర్ఘ్యశేషముగల ప్రథమపాత్రము తీసివేయఁగూడదు. మఱియు నా ప్రథమ పాత్రమును శ్రాద్ధకర్మ పూర్తి యగునంతవఱకు తృతీయపాత్రిచేఁ గప్పియుంచవలెను. "కొందఱు ప్రథమ పాత్రనే బోర్లించి యుంచవలెనందురు"ని శౌనక మహర్షి వాక్రుచ్చెను,

౮

ఈసమయమున గంధము, మాల్యము, ధూపము, దీపము, వస్త్రములను నిమ్మదే యివ్వఁదగు. వీని నొసంగునపుడు కర్త ప్రాచీనావీతి కావలయును. దక్షిణాయగు గోహిరణ్యాదికము శ్రాద్ధాన్తమున స్వధా వచనమునకు పూర్వమిచ్చునది. అనాహితాగ్నివిషయమున పిండ పితృయజ్ఞమునకు పార్వణమునకు వ్యాసంగము కలదు గావున ఇష్టమువఱకు పిండ పితృయజ్ఞవిధిగా నొసంగి బ్రాహ్మణ పాదప్రక్షాళన మొదలు వస్త్రధారణ పర్యంతము పార్వణవిధిగా నొసంగి పిమ్మట పితృయజ్ఞ స్థాలీపాకమునకు వండిన యన్నము గ్రహించి ఘృతముచేఁ దడిపి భోక్తలగు బ్రాహ్మణులను "అగ్నౌకరిష్యే" అనిగాని "అగ్నౌకరుణు" అనిగాని "అగ్నౌకరవాణి" అని ప్ర యడుగును. బ్రాహ్మణులు "చేయుము" అని యనుజ్ఞ నిత్తురు. పిమ్మట వెనుక చెప్పినట్లు సోముని నగ్నినుద్దేశించి రెండాహుతులు వేయును. బ్రాహ్మణులు పాణులందు హోమము నంగీకరించిన పాణులందే హోమము చేయవలెను. పిండపితృయజ్ఞప్రాప్తి యున్నయెడల పాణిహోమము నంగీకరింపరు. పిండపితృయజ్ఞప్రాప్తి లేనియెడల పాణిహోమము నంగీకరింతురు. పిత్రాదిత్రయ స్థానములందుగల బ్రాహ్మణులందరి పాణులందు హోమము చేయవలెను. ఈపక్షమున, మేక్షణానుప్రహరణము లేదు. బ్రాహ్మణుల సమీపమున పిండనిర్వాపణము చేయునది. ఇది యాహితాగ్ని విషయము.

ఇఁక ననాహితాగ్ని విషయమున నగ్నౌకరణమే యని తెలియునది. దీనికి "అగ్నిముఖా వై దేవాః పాణిముఖా వై పితరః" అను శ్రుతియే ప్రమాణము.

అగ్నౌకరణమున భోజనములందు భోజనార్థము వేరుగా నన్నము నుంచునది.
అగ్నౌకరణమునగాని పాణిహోమమునగాని హుతశేషమును భోజన పాత్రములందుంచఁ
బడిన యన్నములందుంచవలయు పాణిహోమ పక్షమున హుతమును భుజించిన యనం
తరము వేరుగా నన్నము నుంచునది. అగ్నౌకరణమునగాని పాణిహోమమునగాని
హుతశేషమును భోజన పాత్రము లందుంచఁబడిన యన్నములందుంచవలయు. ప్రభూ
తాన్నమభివృద్ధి కలుగఁజేయు స్వభావముగలది, కావున భోక్త భుజించు దానికంటె నధి
కముగా నన్నము పాత్రములయందుంచునది. బ్రాహ్మణులు భోజనముచే తృప్తులై
నట్లు తెలిసికొని మధుమతీ ఋక్కులు మూడు మఱియొక ఋక్కు వారికి వినిపింపఁ
దగు. పిదప ప్రభూతముచే సర్వము సంపన్నమనిపించి భుక్తశేషమగు నన్నమునుండి
పిండార్థమన్నమును గ్రహించునది. దానిని స్థాలీపాకముతో నేకముచేయునది ఈ సమ
యమునందే అన్న ప్రకీరణార్థము భుక్తశేషములనుండి యన్నము గ్రహింపవలయు
ఆగ్రహించిన దానినే బ్రాహ్మణులకు నివేదించునది దేనియందు స్థాలీపాకములేదో
దానితో భుక్తశేషమును కలిపి పిండనిర్వాపణము చేయునది. ఎక్కడ స్థాలీపాక విధి
లేదో యచట భుక్తశేషముచేతనే పిండనిర్వాపణము కర్తవ్యము. ఇచటఁగది గమనిం
చునది. అన్వష్టక్యము, సప్తమీ శ్రాద్ధము, మాసశ్రాద్ధము, పార్వణము. ఈనాల్గింటి
యందు పిండ పితృయజ్ఞకల్పమున్నది. కనుక వీనియందు స్థాలీపాకముతో నగ్నౌకరణ
విధాన మాచరించునది అగ్నిసమీపమున స్థాలీపాకముతో భుక్తశేషమును గలిపి పిండ
నిర్వాపణ కర్తవ్యము. కామ్యము, అభ్యుదయికము, అష్టక ఏకోద్దిష్టము. ఈనాల్గింటి
యందు భోజనార్థమగు నన్నమునుండి గ్రహించి యభిఘరించి పాణిహోమము కర్తవ్యము.
బ్రాహ్మణసమీపమందు భుక్తశేషము చేతనే పిండ నిర్వాపణము, వీనియందు స్థాలీపాక
విధి పిండ పితృయజ్ఞకల్పములులేవు. నివేదిత శేషము బ్రాహ్మణులు స్వీకరింప నిష్టపడి
నచో వారికీయవలయు. లేక వారు ఇష్టులతో తినుమని యనుజ్ఞనిచ్చినచో భుక్తశేష
ముచే జ్ఞాతులగు బాంధవులతోఁగూడి భుజింపఁదగు. భోక్తలు భుజించిన తరువాత
పాదాచామనము చేయకపూర్వము పిండ నిర్వాపణము గావించునది. కొందరాచన
మహా సంగరము పిండదాన మంగీకరింతురు. ఆచమనమైన పిమ్మట ఉచ్ఛిష్టముల చెంత
నన్నమును చల్లవలయును. పిమ్మట యజ్ఞోపవీతియై బ్రాహ్మణులకు దక్షిణ మొసఁగి స్వధా
కారము నుచ్చరింపఁజేసి వారిని విసర్జించునది. లేదా స్వధాయగుగాకయని యైన వారిచే
పలికించనగు.

శూలగవకర్మ నిరూపణము. గోపశువుచే రుద్రునుద్దేశించి యజింపఁబడుచున్నది గనుక నీయాగము శూలగవమని పేర్కొనబడినది. ఇది వసంతఋతువునందుగాని శరదృతువునందుగాని యార్ద్రానక్షత్రమున చేయనగు. ఈ గోపశువు యజమాన పశుసంఘమున దృఢకాయము కలిగినదై యుండవలయును బొల్లిమచ్చలుండరాదు. ఎఱ్ఱని రంగుమీద తెల్లని చుక్కలు గలిగియుండకూడదు. శరీరమున నల్లనిమచ్చ లుండవచ్చునని కొందఱిమతము. దోరగాఁబండిన నేరేడు కాయవలె నలుపు మెఱుపు గలిసిన వర్ణము శ్రేష్ఠము. ఇట్టి పశువు నీకర్మకుముందే వ్రీహియవ మిశ్రితమైన జలముచేఁ దలమొదలు పుచ్ఛమువఱకు వీపును దడుపునది. పిమ్మట నది సమంత్రకముగా విడువఁబడినదై దంతములు మొలచునంతవఱకుఁ బెంచఁదగినది. తదుపరి యవస్థయందు ముందుఁ జెప్పఁబోవు కర్మనాచరించునది. ఈ కర్మ గ్రామమునకు వెలుపల దూరముగా యజ్ఞయోగ్యమైన తూర్పుదిక్కునగాని యుత్తర దిక్కునగాని చేయునది. అపరరాత్రిమందుగాని సూర్యోదయానంతరముగాని యీ యాగకాలము పేర్కొనఁబడినది. శూలగవయాగ విధానము తెలిసినవాఁడు స్వయముగ నాచరించినవాఁడునగు బ్రహ్మను వరించవలయు. ఆబ్రహ్మ యాజ్యభాగాంత మగ్నికర్మ నొనరించి శామిత్రాయతన మొనరించును. ఆకులతో నిండిన యొక పచ్చికొమ్మను యూపార్థమగ్నికిఁ దూర్పుభాగమునఁ బాతును. ఈశాఖను చెక్కఁగూడదు. ఇది యూపప్రమాణముగలిగి యుండవలయు. దర్భత్రాళ్ళుగాని తీగెలుగాని రెంటిని పగ్గములుగా గ్రహించి ఒకదానిని శాఖకుఁ జుట్టవలయు, మఱియొక పగ్గముచేత పశువు దక్షిణశృంగమును యూపమునకు సమంత్రకముగా బంధింపవలయు. ప్రోక్షణాదికము పశుకల్పోక్తవిధిగా నొనరించి ముందుఁ జెప్పఁబోవురీతిగా నొనరించునది. వపాహోమము పాత్రిచేఁగాని పర్ణముచేఁగాని కర్తవ్యము బ్రహ్మవపాస్థాలీ పాకావదాన హోమపర్యంతముచేసి స్విష్టకృత్తుకుఁ బూర్వమొక్కొక్క దిక్కున నాలుఁగు నాలుఁగు కుశ సూనములుంచి వానియందు చరుశేషముచేఁగాని మాంసశేషముచేఁగాని సమంత్రకముగాఁ బలిని వేయును. దర్భదంతులచేతను, దర్భపత్రములచేతను కట్టకట్టి యగ్రముల నన్నిఁటి నొకఁటిగా కట్టఁగా నవికుశసూనములనఁబడును. నాల్గు దిక్కులను నాల్గు సూక్తములచే నుపస్థానము చేయును. దిక్కుల నిట్లుపస్థానము చేయుట సర్వరుద్రయాగములందుగలదు. ప్లీహను, నూకను పుచ్ఛమును చర్మమును, శిరమును, పాదములను నగ్నియందుంచునది. చర్మముచేఁ జెప్పులు చేయింపవలెనని శావంత్యాచార్యులు చెప్పుచున్నారు. అంగావదాన సమయమున నొక పాత్ర

ముచే రక్తమును గ్రహించునది. దాని నిపుడగ్నికుదగ్భాగమున దర్భ సమూహము లందుగాని పుళమానములందుగాని సమంత్రికముగా పోయవలయు. పిమ్మట నుత్తరదిశగా దిరిగి యా పశువును జంపినప్రదేశమున రక్తముగాని, ఊవధ్యముగాని స్రవించి భూమిపై పడినదానిని సమంత్రికముగా సర్పములకొఱకు నిచ్చును. దానిని సర్పములు మున్నగునవి దేవతారూపములుగా స్వీకరించును. పిమ్మట స్విష్టకృదాది హృదయశూలోద్వాసనము హోమ శేషము పూర్తిగావించునది "లోకమందున్న సర్వశబ్దములచే రుద్రుఁడే వాచ్యుఁడు. ముల్లోకములందుగల సేనలన్నియు రుద్రదేవునివే గావున, రాజాదులు, దేవాదులు, రుద్రస్వరూపులు లోకమునగల యుత్కృష్టవస్తువులునున్నతమైన పర్వతాదులన్నియు రుద్రాంశ సంభూతములనియే గుర్తించి రుద్రునుద్దేశించి యెవఁడు యాగము చేయునో నట్టివానిని రుద్రుఁడధికసుఖవంతునిగాఁ జేయును. ఈ శూలగవయాగ కర్మను గూర్చి చెప్పువానినిగూడ రుద్రుఁడు హింసింపఁడని వేదము చెప్పుచున్నది. పశుహుత శేషమును బ్రాశనము చేయఁగూడదని కొందరందురు. కాని శుభకరమగుటచే నయ్యది తప్పక ప్రాశనము చేయదగినది. ఈ కర్మకు సంబంధించిన వానిని గ్రామములోనికి తీసికొని రాకూడదు. వారిని తీసికొని వచ్చినవానిని రుద్రుఁడు హింసించును. ఈ కర్మ సమీపమునకుఁ బుత్రాదులను రానీయఁజనదు. ఈ శూలగవాఖ్య కర్మచే యాగము చేసినవానికి ధన, లోక, పుణ్య, పుత్ర, పశ్వాయుర్యశస్సులు కలుగును.

ఈరీతిగా శూలగవమొనర్చి పూర్వము గ్రహించిన పశువువంటిపశువును మరియొకదానిని గ్రహించి యభిషేచనము చేసి దానిని మఱియొకమారు శూలగవము చేయుటకు విడువవలయును, శూలగవము తప్పక చేయదగినది కాన నది నిత్యకర్మయగుచున్నది. శూలగవకర్మ రహితుఁడు కాగూడదని శ్రుతి పల్కుచున్నది.

శూలగవమును యాగముగావించి గ్రామమును ప్రవేశించి శాంతాతీయ సూక్తమును పఠించుచున్నవాఁడై గృహమును చేరవలయు. యజమానుని పశువులకు వ్యాధిసంభవించినచో రుద్రదేవుని గోష్ఠమధ్యమున యజింపవలయు. ఆద్యభాగాన్తము చేసి దర్వియందు స్థాలీపాకమునంతయునుంచి యభిఘరించి సర్వహుతముగా హోమము చేయునది. పిమ్మట దిగుపస్థానముచేసి సర్వప్రాయశ్చిత్తాదులతో హోమకర్మ పూర్తిగావింపవలయు. పిమ్మట బర్హిస్సులాజ్యము, పొట్టు, నూక, మున్నగునవి యగ్నియందుంచి యాపొగకెదురుగా వ్యాధిగ్రస్తములగు పశువులను తీసికొనిరావలయు. తరువాత శాంతాతీయ సూక్తమును జపించుచు మధ్యగారావలయు.

శౌనకాయనమః

వేదపురుషాయనమః

# కౌషీతకి గృహ్యసూత్ర సమీక్ష

## ప్రథమాధ్యాయము

౧

శ్రౌతకర్మల యనంతరము పాకయజ్ఞములు వ్యాఖ్యానింపఁ బడుచున్నవి. అభివృద్ధి నొందగోరువాఁడేయగ్నియందంతియు సమిధనుంచునో యాయగ్నినేఁ బ్రజ్వలింపఁ జేయునది అది వైవాహికాగ్నిగాని దాయాద్యకాల ప్రాప్తాగ్నికాని కావచ్చునందురు. దీనియందు ముందు చెప్పఁబోవు రీతిగాఁ బూర్ణాహుతి మొదలగునవి లేవు. గృహపతి చనిపోగా జ్యేష్ఠుఁడైనవాఁడు స్వయముగా వైశాఖామాస్యయందుగాని మఱియొక తిథియందు శుభ నక్షత్రమందుగాని యగ్నిని నిలువుకొనునదని మఱికొందరందురు. ప్రభూతపాకముగల వానియింటనుండిగాని వైశ్యకులమునుండిగాని యంబరీషునివద్దనుండిగాని బహుయాజినుండిగాని యగ్నినిదెచ్చి యావజ్జీవము సాయం ప్రాతః కాలములందగ్నిని ప్రజ్వలింపఁ జేయదగునని కొందరంగీకరింతురు. సాయంకాలమందలి యాహుతి సంస్కార మధ్వర్యుని వశమని యాచార్యులు చెప్పుదురు. ప్రాతఃకాలమందు పూర్ణాహుతిని విష్ణుదేవతాకఋక్కుచేతగాని ప్రజాపతిని ధ్యానించి మంత్రరహితముగ గాని వేల్చవలయును. అగ్నిని ప్రతిష్ఠించుకొను కాలము శ్రౌతమున నగ్నిహోత్ర విధానమందుఁ జేర్కొనబడినది. యజ్ఞోపవీతిత్వము మున్నగునవసరమైనదెల్ల శ్రౌతోక్తమే గ్రాహ్యము. పాకయజ్ఞములు హవిర్యజ్ఞములు, సోమయజ్ఞములని యజ్ఞరీతులిరువదియొక్కటిగాఁ గీర్తింపఁబడుచున్నవి.

౨

కర్మసమాప్తియందు బ్రాహ్మణభోజనమునిర్వర్తింపనగు. వాక్కు, రూపము వయస్సు, శ్రుతము, శీలము, వర్తనము, బ్రాహ్మణగుణములు. శ్రుత మనునదన్నిఁటికన్నమిన్న. శ్రుతమనగా నధిదైవము, అధ్యాత్మము, అధియజ్ఞము అని మంత్రముల

యందు బ్రాహ్మణమందుఁ జేర్పఁబడినది. కర్మిష్ఠుఁ డధ్యయన సంపన్నుఁడు శ్రుత సంపన్నుఁడును తపశ్శాలియునగు బ్రాహ్మణునకు భోజనమిడిన గృహమేధికినన్న దారిద్ర్యము గలుగదు. సర్వకర్మలయందే దేవతనైననుఁ దృప్తిఁ బొందింపఁ దలచినవాఁడా దేవత నుద్దేశించి పూర్వోక్తమైన బ్రాహ్మణునకు మనఃపూర్వకముగా భోజనమిడవలయును. ఏ కర్మయందైనను పూర్వోక్తగుణములులేని బ్రాహ్మణున కిచ్చిన హవిస్సుద్దిష్ట దేవతను పొందదు. పూర్వోక్తగుణ సంపన్నుఁడగు బ్రాహ్మణుఁడు దేవతలకుఁ బ్రతినిధి. మానవులకు నిధివంటివాఁడు.

3

## దర్శపూర్ణమాసలవిధి

దర్శపూర్ణమాసలకుఁ బూర్వ మన్వారంభణీయ కర్మఁ జేయఁదగు. అగ్నియందు యథావిధిగా చరువునువండి యగ్నావిష్ణువులు మున్నగు నన్వారంభణీయ దేవతల నుద్దేశించి హోమముగావించి పిదపస్విష్టకృత్తుచే వేల్చి యథోత్సాహముగా దక్షిణలిచ్చి హోమకర్మఁ పూర్తిచేయునది. పిమ్మట బ్రాహ్మణభోజనము కర్తవ్యము. అన్వారంభణీయ కర్మానంతరము యావజ్జీవము దర్శపూర్ణమాసలు యజింపఁదగినవి. మహావృక్షాగ్రములను సూర్యుఁడే సమయమునఁ దపింపఁ జేయుచుండునో యత్యాది శుభప్రదమైన కాలముగా నెఱుంగునది. దర్శపూర్ణమాస నుద్దేశించి యే ద్రవ్యములతోఁ జరుపుఁ జేయఁ దలంచెనో వానిని, లవణమును, మాంసముల భుజింపరాదు. అల్పముగా భుజింపవలయును. మైథునకర్మకూడదు. పాడ్యమియందాదిత్యోదయానంతరము శుచియై ప్రసన్నమనస్కుఁడై శుచియగు మనోహర ప్రదేశమునఁ బూర్ణవిధానముగా చరువును గ్రహణాసాదన ప్రోక్షణములను లేకుండవండి అవదానధర్మముతో, నగ్నీషోముల నుద్దేశించి వేల్చి స్విష్టకృదాది తంత్రశేషముపూర్తిఁగావించనగు. అమావాస్యయందు పూర్వము వలె ప్రతస్థుఁడై పాడ్యమియందుఁ బ్రాతఃకాలమున చరువునువండి యగ్నిని విష్ణువునింద్రాగ్నులనుద్దేశించి యగ్నియందు వేల్చిస్విష్టకృదాది కర్మశేషము పూర్తిగావించఁదగు. ఇఁట సాన్నాయ్యయాజి విష్ణువునకుబదులు, అగ్నీషోముల నింద్రాగ్నులకు బదులుగాఁ ఇంద్రుని దేవతలగా స్వీకరించునది. పౌర్ణమాసివఱకు దర్శకర్మకాలము, దర్శవఱకు పూర్ణమాసకర్మకాలము అని గుర్తించునది. అమావాస్య దర్శనాఁబడు. కొందఱు ప్రాతర్గాహుతి కాలమతిక్రమించెనేని యా యాహుతిని సాయమాహుతికాలమున నిర్వర్తింప నగునందురు. కాని వీనిలో కాలాతిక్రమణముగూడదు. అగ్నిహోత్ర హోమ

విషయమున భిన్నకాలమునకు ప్రాయశ్చిత్త విధానము కనఁబడుటయే యిందుకు కారణము. నిత్యాహుతులయందు వ్రీహి, యవ తండులములలో నొకదానిని హవిష్యముగా స్వీకరింపఁదగు. ఇవి సంభవింపనిచో మఱియొకటి గ్రహింపఁదగు. తండులములైనచో ప్రక్షాళన సంస్కారముగలదు. ఇదితరములకులేదు. నిత్యములగు సాయంప్రాతర్ హోమములయందు సాయంకాలము నాదిత్యాస్తమయానంతర మగ్నికి ముమ్మాఱు పరిసమూహనము పర్యుక్షణముఁ జేసి యందు సమిధనుంచి యగ్నినుద్దేశించియొక యాహుతి ప్రజాపతిని ధ్యానించి మన్త్రరహితముగా మఱియొక యాహుతి వేయవలయు. ప్రాతఃకాలమున సూర్యోదయాత్పూర్వ మగ్నినుద్దీపింపఁజేసి పూర్వమువలె పర్యుక్షణ మొనరించి సూర్యునుద్దేశించి యొకయాహుతి, పూర్వమువలె ప్రజాపత్యాహుతి మఱియొకటి వేయఁదగినవి.

౪

ప్రాతఃకాలమున నహరహము స్వాధ్యాయమధ్యయనము చేయఁదగు. "అఘానో దేవసవిత," అనుఋక్కులురెండు "అపేహి మనసస్పతి" అనుసూక్తము "ఋతంచసత్యంచ" అనుసూక్తము "ఆదిత్యావహీంక్షత" అనుసూక్తశేషము "ఇంద్రశ్రేష్ఠాని" అను నొకఋక్కు "అహంసశ్చుచిషత్" అనియొకఋక్కు "నమోమహద్భ్యః" అని యొక ఋక్కు "యతయింద్రభయామహే" అనునొకఋక్కు "అధస్వప్నస్య" అను యొక ఋక్కు "యోమేరాజన్" అని యొకఋక్కు "మమాగ్నే వర్చః" అనియొకసూక్తము "స్వస్తినోమిమీతాం" అని యైదుఋక్కులు.

౫

పాకయజ్ఞములు "హుతములు, అహుతములు, ప్రహుతములు, ప్రాశితములు" అని నాలుఁగు తెఱఁగులు. వివాహము, చూడాకరణము. ఉపనయనము, కేశాన్తము. సీమంతోన్నయనము అను నీయైదుకర్మలయందు గృహప్రాంగణము నలికి యందు నుల్లేఖనావోక్షణముల నాచరించి యగ్నిప్రణయనము చేయునది. కొందఱగ్నిని మథింపవలయు నని యందురు. ఉత్తరాయణ శుక్లపక్షమున శుభదినమందు లక్షణసంపన్న యగుకన్యను వివాహమాడవలయును. సరియగు నంగములుండవలయు. కన్యకు సమానాంతములైన కేశములు మెడయందు ప్రదక్షిణముగా తిరిగియున్న సుడులున్న నామెకాఱుగురు వీరులగు పుత్రులు ఉదయింపగలరు.

౬

భార్యనుస్వీకరింపఁదలచినవాఁడు కన్యను వెదుకుటకు వెళ్ళువారి ననుమంత్రించి పంపును. వారచటకు వెళ్ళినపిమ్మట పుష్పఫలయవములను, ఉదకుంభమును గ్రహించి ప్రాతఃకాలమున తమతమ నామధేయముల నుచ్చరించి యభివాదనము చేయుదురు. కన్యాగృహమందలి వారు ప్రాఙ్ముఖులై కన్యను వరించువారు పశ్చిమాభిముఖులై కూర్చుండి పూర్వోక్తోదక కుంభము మధ్య నుంచుకొందురు. పిమ్మట వరుని తరపువారు వరుని గోత్రనామములను చెప్పి కన్యను గోరుదురు. అప్పుడుభయాంగీకారమైనచో పుష్పాక్షత ఫలయవ హిరణ్య మిశ్రమై యెదుటనున్న పూర్ణపాత్రినిసమంత్రకముగా తాకుదురు. అప్పుడు వరుని పురోహితుఁడా పూర్ణపాత్రినికన్యాశిరమున సమంత్రకముగా నుంతురు.

౭

వరునివైపువారు గృహమునకే తెంచి ప్రతిశ్రుతమను కర్మనాచరింతురు. గోమయముతో చతురస్రముగా నలికి దానిమధ్య నుత్తరాంతముగా నొకరేఖనుగీసి దానిపైన ప్రాగంతములుగ మూఁడురేఖలనుగీసి యారేఖలను బ్రోక్షించి సమంత్రకముగా నగ్ని ప్రణయనము గావించునది. అగ్నికి ప్రదక్షిణముగా సోదకమగు పాణితో ముమ్మారు చుట్టుతుడుచును. ఈతుడుచుట సమూహనమునాఁబడు. పితృకర్మలందపసవ్యముగా నొక సారి మాత్రమీ సమూహనము చేయునది.

౮

అనంతరము పరిస్తరణము– సవ్యహస్తముతో ప్రాగగ్రములగు కుశలను గ్రహించి కుడిచేతితో నగ్నికి పూర్వభాగమున మూడేసి చొప్పున ముమ్మారు పఱచవలయు. ఇట్లే పశ్చిమభాగమున దక్షిణమున నుత్తరభాగమున పఱచునది. తొమ్మిదేసి కుశలగును. లేదా యైదుసార్లు బఱచిన పదునైదు దర్భలగును. ఇది 'పరిస్తరణ లక్షణము. కొందఱు ఒక్కటిచొప్పున మూడుసార్లు పఱచి మూఁడుగా అయిదుసార్లు పఱచి అయిదుదర్భలుగా పరిస్తరణము నేర్పరతురు–ప్రతిమూల, మూలముల నగ్రములచేఁగప్పి యుండునట్లు చేయుదురు. ప్రతిక్రియయు దక్షిణము మొదలుత్తరాంతముగాఁ జేయునది. దక్షిణదిగ్భాగమున బ్రహ్మనుప్రతిష్ఠించి పుష్పాదులచే నలంకరించును. ఉత్తరభాగమున ప్రణీత పాత్రములనుంచి సమంత్రకముగా సవ్యహస్తముతో కుశలనుగ్రహించి దక్షిణ

హస్తముతో పూర్వోక్త పరిస్తరణము చేయునది. ఆజ్యాహుతులందు పరిస్తరణము వికల్పము. నిత్యాహుతులందును వికల్పమని మాండూకేయుని వాదము. చీలనియగ్రములు గలవియు, నన్తర్గర్భములు గానట్టియు కుశతృణములను హెచ్చుతగ్గులు లేకుండ గ్రహింపవలెను. వానిని ప్రాదేశసమ్మితములుగా కుశసహితముగ కత్తితో సమంత్రకముగా ఛేదించునది. ఈ పవిత్రములు రెండుగాని మూడుగాని కావచ్చును. వానిని ప్రాగగ్రములుగా గ్రహించి ప్రోక్షించి పూర్వోక్త పవిత్రద్వయముచే బ్రదక్షిణముగా నగ్నిని ముమ్మారు పర్యుక్షణము చేయునది.

అనంతరమాజ్యస్థాలినిగ్రహించి సమంత్రకముగా నగ్నియందు కాచి సమంత్రకముగా నుత్తరముగాదింపునది. పిమ్మట రెండు పవిత్రముల నుదగగ్రములుగా నంగుష్ఠానామికలచే రెండువైపుల పట్టుకొని మధ్య వంగునట్లును ఊర్ధ్వాగ్రములగునట్లును చేసి యాజ్యమునందు సమంత్రకముగా నుంచునది. ఇది యాజ్యసంస్కారము. అసంస్కృతమైన యాజ్యమును హోమము చేయరాదు. ఆజ్యోత్పవన మంత్రముచేతనే స్రువమునందలి జలమునుగూడ నుత్పవనము చేసి యా జలమును ప్రణీత పాత్రలందు కొంత పోసి శేషముచే సమిదాది ద్రవ్యములను ప్రోక్షించునది.

౮

అగ్నియందు పదునేడు సమిధలనుంచి సవ్యహస్తముతో సమంత్రకముగా కుశలను దక్షిణహస్తముతో స్రువమూలప్రదేశమునం బట్టుకొనునది. దక్షిణజానువును నేలకుతాకించి దక్షిణబాహువును రెండు మోకాళ్ళమధ్యనుంచి యాఘారములను రెండవిచ్ఛిన్నాజ్యాహుతులను వేయవలయును. అందొకటి యగ్నికిం బశ్చిమార్ధమున నుత్తరభాగమునుండి దక్షిణవైపునకు, రెండవదగ్నికిం బశ్చిమార్ధమున దక్షిణమునుండి యుత్తరవైపునకును. అంతట నగ్నికుదగ్భాగమున నాగ్నేయాజ్యభాగాహుతిని, దక్షిణమున సౌమాజ్యభాగాహుతిని వేయవలయును. మధ్యభాగమున నితరాహుతులు వేయనగు. అగ్ని, సోముండు, పూషుడు వీరి నుద్దేశించి కన్యానామగ్రహణము చేయుచు మూండాహుతులను వేయునది. ఆజ్యహోమవిషయమున నాజ్యభాగములు స్విష్టకృత్తునిత్యము. నిత్యహోమమందును నివియనిత్యమని మాండూకేయుల తాత్పర్యము. స్విష్టకృద్ధోమము కర్తవ్యము. తరువాతి మహావ్యాహృతి, సర్వప్రాయశ్చిత్త ప్రాజాపత్యాహుతులు వేయునది. సవ్యహస్తమునసున్న కుశలమూలమును సవ్యహస్తముతోను, అగ్రభాగ

మును దక్షిణ హస్తములోను గ్రహించి వాని యగ్రభాగములను స్రువమందు తాకించును. మూలమధ్యభాగముల నాజ్యస్థాలియందు తాకించునది.

స్థాలీపాక యజ్ఞము లందగ్రభాగములను స్రుక్కునందు, మధ్యభాగమును స్రువమందును మూలములను నాజ్యస్థాలీయందును తాకింపవలయు. వానిని సమంత్రకముగా నగ్నియందుంచునది. పిమ్మట మూఁడు సమిథలను వేల్చి పూర్వమువలెఁ బర్యుక్షణము చేయఁదగు.

మంత్రములు పేర్కొనకుండ యాదేశింపఁబడిన దేవతల విషయమున పురుష దేవతలైనచో "అముష్మై స్వాహా" యని స్త్రీ దేవతలైనచో "అముష్యై స్వాహా" యనియు చెప్పనగు. ఇది ప్రతిసుతకర్మ.

౧౦

నిశ్రేయసకర్మలగు నన్నియాజ్య హోమములకు, శాఖాపశుయజ్ఞములకు, చరుపాకయజ్ఞములకు, ప్రతిసృత కర్మయందు క్తమైన హోమకల్పము ప్రకృతి.

అగ్నిహోత్రహోమముచే హుతములు, బలికర్మచే నహుతములు, పితృకర్మచే ప్రహుతములు, బ్రాహ్మణభోజనమువలన ప్రాశితములు నగుచున్నవి. ఎప్పుడు నూర్ధ్వజ్ఞువుకాకుండ వ్యాథజానువై హవిస్సును హోమము చేయవలయు. మోకాళ్ళకు వెలుపల చేతులుంచి హోమము చేసిన దానినెప్పుడును దేవతలు పరిగ్రహింపరు. రౌద్రము, రాక్షసము, పిత్ర్యము, ఆసురము, ఆభిచారికము, లనుమంత్రముల నుచ్చరించినపుడుగాని, తన శరీరమును తనచేతితో తాకినపుడుగాని యుదకమును తాకవలయు.

౧౧

ఇఁటఇంద్రాణీ హోమము చేయఁదగు. రేపుగాని యెల్లుండిగాని కన్యకు వివాహముజరుగఁబోవుచుండగా నీరోజరాత్రియందు అర్ధరాత్రిగడచినపిమ్మట సర్వౌషధి పుష్పమిశ్రములు, సుగన్ధిద్రవ్య మిశ్రమములయిన జలములచేఁ గన్యకు శిరస్స్నానము చేయించి కుసుమ్భవర్ణముగల వస్త్రమునుగాని లేక నూతన వస్త్రమునుగాని కట్టబెట్టి యగ్నికిఁ బశ్చిమభాగమున కన్యను కూర్చుండఁబెట్టుదురు. ఆమె యనుసరించి యుండగా మహావ్యాహృతులతో నాల్గాహుతులు వేసి "అగ్నయే, సోమాయ, ప్రజాపతయే, మిత్రాయ, వరుణాయ, ఇన్ద్రాయ, ఇన్ద్రాణ్యై, గన్ధర్వాయ, భగాయ, పూష్ణే, త్వష్ట్రే, బృహస్పతయే, రాజ్ఞేప్రత్యనీకాయ" అను పదమూఁడు మంత్రములలోఁ బద

మూఁడాహుతులు వేయుదురు. తదనంతరము నలుగురుగాని, యెనిమిదిమందిగాని, ముత్తైదువులను, శాకముచేగాని, సురచేగాని, మధురాన్నముచేగాని, తృప్తిఁబొందించి చతుర్థీకర్మమును చేయింతురు. పిదప స్విష్టకృదాది హోమశేషమును పూర్తిగావింతురు. తెల్లవారినతరువాత బ్రాహ్మణభోజనము, వరునియింటఁగూడ నీవిధముగనే చేయుదురు. కాని యాజ్యాహుతులతో వైశ్రవణాయ, ఈశానాయ, అను రెండాహుతులధికము.

౧౨

వరుఁడు సుస్నాతుఁడై మంగళాలంకృతుఁడై పుణ్యాహవాచన మాచరించి స్వగృహమునుండి శ్వశురగృహమున కేతెంచి యగ్నిని బ్రతిష్ఠించి యందాజ్యభాగాంతము చేయును. అనంతరము యువతులైన ముత్తైదువులు వరుని తోడ్కొని కన్యాదర్శనార్థము కౌతుకగృహమును ప్రవేశింతురు. అచట వరుఁడభక్ష్యములు పాతకములు కానివానికనుకూలుఁడై ప్రవర్తింపవలయు. ఆస్త్రీలచే, ననుజ్ఞాతుఁడై సమన్త్రకముగా నొకవస్త్రమును కన్యకిచ్చును. తదనంతరము సమంత్రకముగా నాకన్యను కౌతుకఁబెట్టుకొనఁజేయును. సమంత్రకముగా నేదుపందిముల్లు నొకదాని నామె దక్షిణహస్తమున కందించును. ఎడమచేతి కద్దము నిచ్చును. పిమ్మటకన్యకు జ్ఞాతులైనవారు ఎఱ్ఱని, నల్లని, మణులను మూటిని నొకవర్ణము తరువాత మఱియొకటి యుండునట్లు ఉన్నిగాని పట్టుగాని అయిన సూత్రమున గ్రుచ్చి కన్యాకంఠమున సమన్త్రకముగా కట్టుదురు. ఈసూత్రము జానులంబిగా నుండును. ఇట్లే యిప్పపూలదండను సమంత్రకముగా కట్టుదురు. తరువాత కన్యాదాత గోవును పూజించి మధుపర్కమును గోవును జామాతకొసంగును. పిమ్మట కన్యను తండ్రిగాని సోదరుఁడుగాని యుదకపూర్వకముగా వరునకిత్తురు. ఇఁట కొందరు వరుఁడు వచ్చినవెంటనే మధుపర్కమునిచ్చి కన్యాదానముచేసి కౌతుకగృహప్రవేశము చేయింతురు. పిమ్మట వరుఁడగ్నికిఁ బశ్చిమభాగమున కన్యనాసీనంగావించి మహావ్యాహృతులతో నాల్గాజ్యాహుతులను వేల్చును. సర్వభూతికర్మలయందు మంత్రాదేశములేని తఱి యాదిలో నంతమునందును మహావ్యాహృతులచే నాజ్యాహుతులు వేల్పదగు.

౧౩

తదనంతరము కన్యతండ్రిగాని సోదరుఁడుగాని కన్యకెదురుగానిలిచి ఖడ్గాగ్రముచేతగాని స్రువముచేతగాని యామె మూర్ధప్రదేశమున నాజ్యముంచును. వరుఁడు కన్య

కభిముఖముగా నిలుచుండి పైకిత్రిప్పిన కన్యాదక్షిణహస్తమును పైకిత్రిప్పిన తన దక్షిణ హస్తముతో సాంగుష్ఠముగా గ్రహించును. కొన్ని మంత్రముల జపించును. ఆసమయమున నే బ్రాహ్మణులు నలుగురు, రూపవంతులు, యువకులు, అగ్నికి దక్షిణమున నుత్తరాభిముఖులై కొన్ని మంత్రములను వినుపింతురు. తరువాత నాచార్యుఁడు నిందుకుఁడను పుంలింగనామములుగల వృక్షముల పచ్చియాకులను దర్భలతో కలిపి యుదకకుంభమున నుంచును. కొందఱు బంగారమునుగూడ నుంతురు. దానిని మానవ్రతుఁడైన బ్రహ్మచారి కొనంగును. ఆబ్రహ్మచారి యుదకకుంభము నగ్నికీశాన్యదిగ్భాగముననుంచి దానిని పట్టుకొనియుండును. పిమ్మట నాచార్యుఁడు పాషాణమునుంచును. పిమ్మట వరుఁడు మంత్రము పఠించుచు వధువునులేపి యుత్తరవైపునకు దీసికొనిపోయి యచటనున్న పాషాణము నామెదక్షిణపాదముచే మంత్రోచ్చారణ పూర్వకముగా త్రొక్కించును. పిమ్మట వరుఁడగ్నికిఁ బ్రదక్షిణముచేసి సమంత్రకముగా నామెకు ద్వితీయ వస్త్రము నిచ్చును. పిమ్మట జమ్మియాకులతో మిశ్రితమైన లాజలనుకన్య తండ్రిగాని సోదరుఁడు గాని కన్యదోసిట నుంతురు. ఆచార్యుఁడు వానికుపస్తరణాభిఘారణ ప్రత్యభిఘారణములను, చేయగా వానినామె యగ్నియందు వేల్చును.

౧౮

ఆలాజలను సమంత్రకముగా నామె నిలుచుండి వేల్చును. మంత్రమును వరుఁడు పఠించును. అశ్మారోహణహోమాదిగా ఈలాజ హోమాంతవిధిని, వస్త్రదాన వర్జితముగా రెండవసారి మూఁడవసారి చేసి మంత్రరహితముగా నాల్గవసారి చేయునగు. అగ్నికీశాన్య దిక్కున నేడడుగులు వేయించును. ఈ యేడడుగులు వేయునపుడు వరుఁడేడువాక్యములను పలుకుచుండును. ఈ యడుగు లాచార్యుఁడే వేయింపవలెనని కొందరిమతము. పిమ్మట వరుఁడు సమంత్రకముగా నాయడుగులను నచటియుదకకుంభజలము చేఁబ్రోక్షించి తనవధువును శిరమునప్రోక్షించి "గోవునిచ్చెద"నని వల్కి యాచార్యునకు గోదానమివ్వవలెను. అచ్చట బ్రాహ్మణులున్నచో వారికి యథాశక్తిగా దక్షిణలివ్వఁదగు. తరువాత స్విష్టకృదాది హోమసమాప్తి గావించును.

౧౯

వధువును వరునియింటికిఁ దీసికొని పోవుచుండగా నాచార్యుఁడొకఋక్కును పఠించును. తలిదండ్రులను వీడునపుడామె దుఃఖించిన మరియొక ఋక్కును ఆచార్యుఁడు గాని వరుఁడుగాని పఠించును. రథము నెక్కి వెళ్ళఁదలచినచో వధువు చక్రముకుండను

నేతితో మర్దించును. ఆచార్యుడు మంత్రము పఠించును. అట్లే రథచక్రములను మర్దించును. ఫలవంతమైన వృక్షశాఖను చిడతలుగాఁజేసి కాడిరంధ్రములందు రెండువైపుల నుంచును. పాత చిడతలనైన నుంచును. తరువాత సమంత్రకముగా బలీవర్దములను పూన్చును. పిమ్మట నాయెడ్లను మఱియొక మంత్రముచే నభిమంత్రించును. తదుపరి యా కన్యను రథమునెక్కించి తీసికొని పోవుదురు. అట్లు రథము వెళ్ళుచుండగా రథచక్రపు ఇరుసు మున్నగునవివిరిగినను మెడపలుపు పగ్గములు మున్నగునవి తెగినను, వధువును నొక యాహితాగ్ని గృహమందు ప్రవేశింపఁజేసి క్రొత్తవానిని సమంత్రకముగా చేయించి కూర్చి పంచర్చమును జపించును. వధువు రథమెక్కుచుండగా మంత్రమును పఠించును. చతుష్పథముఁజేరునప్పుడొక ఋక్కును, శ్మశానము ప్రాప్తించునప్పుడొక ఋక్కును. వనస్పతి ప్రాప్తించినప్పుడొక యర్ధర్చమును, నావ నెక్కునప్పుడొక ఋక్కును, నదిని దాటుచుండగా నొకఋక్కును పఠించును. నదీమధ్యమును పొందినప్పుడొక ఋక్కును పఠించును. ఈ ప్రయాణమున కన్య యవగుంఠనముఁ దాల్పదగు. ఈ ప్రయాణమునందు పఠింపదగిన మంత్రములను వరుఁడు పఠించును. వధువుగృహమునుచేరగా నేఁడుఋక్కులను పతిగాని యాచార్యుఁగాని పఠించును. ఇంటికిఁజేరిన వరునకు మధుపర్కము నియ్యవలయు.

౧౬

ఉపలేపనోల్లేఖనాఘారాజ్య భాగాన్తము కర్మనొనరించి వధువును యెఱ్ఱని యెద్దుచర్మముపై నాసీనంగావింతురు. వధువు కుశలనుపట్టుకొని ప్రక్కన కూర్చుండి యుండగా పతినాల్గు ఋక్కులచే నాల్గాజ్యాహుతులను వేల్చును. ఆజ్యశేషముచే కన్యా చక్షువులను తుడుచును, మూడుఋక్కులను పఠించి వధూమూర్ధభాగమున స్రువముతో నాజ్యమునుంచును. ఇది కొందఱంగీకరింపరు. కులీనుఁడైనకుమారుని వధువు నొడిలో సమంత్రకముగాగాని మంత్రరహితముగాగాని యుంచుదురు. పిమ్మట నాకుమారుని దోసిట మంగళప్రదములగు ఫలములనుంచి బ్రాహ్మణులకు దక్షిణలొసంగి వారిచే పుణ్యాహముపలికింతురు.

౧౭

దంపతులు గృహమును ప్రవేశించి సమంత్రకముగా దధిప్రాశనము చేయుదురు. వరుఁడు మంత్రమును పఠించును. పిమ్మట దంపతులాదిత్యాస్తమయ పర్యంతము మౌనముదాల్చి యుందురు. పొద్దుకూకినతరువాత వరుఁడు వధువునకు ధ్రువదర్శనము

చేయించును. వధువు ధ్రువునిచూచినను చూడకపోయినను "ధ్రువుని చూచితిని సంతానమును పొందగల"నని పలుకవలయును. పాణిగ్రహణము మొదలు త్రిరాత్రబ్రహ్మచర్యము నొనరింపవలయు. మైథునేచ్ఛనువీడి నేలపై శయనింపవలయును. దధిమిశ్రాన్నము భుజింపనగు.

సాయంప్రాతఃకాలములయందు వైవాహికాగ్నికి పరిచరణము చేయవలయు. ఉపలేపనోల్లేఖనాద్యాఘారాజ్య భాగాన్తము కర్మము నొనరించి "అగ్నయేనమః" "అగ్నయే స్విష్టకృతేస్వాహా"యని యాజ్యాహుతులను వేసి మహావ్యాహృతులతో సర్వప్రాయశ్చిత్తాది తన్త్ర శేషమును పూర్తిగావించునది ఒకవేళ వధువు శీఘ్రముగా గర్భముధరింపవలెనని తలంచినచో పూర్వోక్తమైన "అగ్నయేస్వాహా" యను మంత్రమునకు బదులు "పుమాంసే" ఇత్యాది మంత్రమును పఠించి యాహుతి వేయునది ఈ పక్షమున వరుఁడు పాణిగ్రహణాదిగా పదిరాత్రులు వధువుతో సంయోగముకలిగి యుండరాదు.

౧౮

త్రిరాత్రబ్రహ్మచర్యమైనపిమ్మట నాల్గవరోజున చతుర్థీకర్మ చేయుదురు. ఉపలేపనాది స్తరణాంతకర్మ నొనరించి అగ్ని, వాయువు, సూర్యుఁడు, అర్యముఁడు, వరుణుఁడు, పూషుఁడు, ప్రజాపతి అను దేవతాసప్తకము నుద్దేశించి తండులములనుగ్రహించి చరువునువండునది, సమిదాధానాది యాజ్యభాగాన్తకర్మ నొనరించి, యేఁడుబుక్కలచే నేఁడు స్థాలీపాకాహుతులను వేల్చునది. తరువాత స్విష్టకృత్తులను వేల్చునది. మహావ్యాహృత్యాది సర్వప్రాయశ్చిత్తాది కర్మను పూర్తిగావించునది.

౧౯

గర్భాధానకర్మ:- వధువు ఋతుస్నానము చేసినపిమ్మట శుభదినమున నుపలేపనోల్లేఖనాద్యాఘారాజ్యభాగాన్త మగ్నికర్మఁజేసి మహావ్యాహృతులు నాల్గింటిచే నాహుతులు వేసి ఫలినీ (పేంకణము) మూలమును నస్యయోగ్యముగనూరి దాని రసముచే రెండుబుక్కలను పఠించుచు దక్షిణనాసికా పుటమునసింఁడి యుదరము ప్రవేశించునట్లు చేయుదురు. తదనంతరము మహావ్యాహృతులు వేసి స్విష్టకృత్తులను వేల్చి మహావ్యాహృతి సర్వప్రాయశ్చిత్తాది తంత్రశేషమును సమాప్తి గావింతురు. ఆరాత్రి మైథున సమయమున సమస్త్రకముగా వధూయోనిప్రదేశమును తాకును. మైథునానంతరము రేతస్స్ఖలనమైన పిమ్మట వధువు నాఘ్రాణించి యస్త్రము నభిమంత్రించియే నిశ్వాసము వధు

కును తాకునట్లు విడుచును. ఈ విధానము ననుప్రాణనమందురు. ఈ యనుప్రాణనమునకు మూఁడుమంత్రములు పఠాంతరములుగ పఠింతురు.

౨౦

వధువు గర్భవతియైన తరువాత మూఁడవమాసమున పుంసవనము చేయుదురు. ఇది పుష్యనక్షత్రమందుగాని శ్రవణనక్షత్రమందుగాని చేయుదురు. ఉపలేపనాద్యాజ్యభాగాన్తకర్మనొనరించి మహావ్యాహృతులతో నాల్గాహుతులు వేసి శ్వేతసోమలతనుగాని, దర్భకొనలనుగాని, మఱ్ఱికొమ్మ చివరమొగ్గనుగాని యూప (గంగరావిచెట్టు) ము చివరి చిగురుగాని, యజ్ఞము సమాప్తియైనపిమ్మట జుహువునుండి స్రవించుదానినిగాని గ్రహించి నస్యయోగ్యముగా నొనరించి నాల్గుమంత్రములతో ప్రతిమంత్రాంతమున నాల్గుసార్లుగా దక్షిణనాసాపుటమున నస్యము చేయింతురు.

౨౧

చతుర్థమాసమున గర్భరక్షణకర్మ చేయుదురు. ఉపలేపనోల్లేఖనాదులు చేసి స్థాలీపాకమువండి యాఱుబుక్కలతో నారాహుతులు వేల్చి యగ్నిసంత్రశేషమును పూర్తిగావింతురు. పిమ్మటనాజ్యస్థాలియందున్నట్టి ఘృతముచేనాఱుబుక్కలు పఠించుచు వధువు శంగములకు లేపనము చేయును. తదనంతర మగ్నికార్యము పూర్తిగావింపవలయు.

౨౨

సప్తమమాసమున సీమన్తోన్నయనము ప్రథమగర్భమునందుఁ జేయుదురు. దీనియందుపయోగించు నుపకరణములన్నియుఁ బుంలింగములుగ నుండునది, పుంలింగ నక్షత్రము గ్రహింపఁదగినది.

ఉల్లేఖనాద్యాజ్య భాగాన్త మగ్నికర్మనొనరించి మంగళస్నానము వధువునకు చేయించి నూతనవస్త్రధారణ మొనరింపఁజేసి యామె నగ్నికిఁ బశ్చిమభాగమున గూర్చుండఁబెట్టుదురు. ఆమె పతిననుసరించి యుండగా పతిఁడు మహావ్యాహృతిహోమము చేసి స్థాలీపాకముచేతగాని ముద్గాన్నముచేతగాని యాఱుమంత్రములతో నాఱాహుతులు వేల్చి పిదప యేదుపంది ముల్లుగాని దర్భాంకురముగాని గ్రహించి మేడికాయలతోఁ జేర్చి యామె లలాటమధ్యదేశమునుండి పాపటను తీయును. నాభివద్దనుండి ప్రారంభించి పాపట తీయవలయునని కొందఱిమతము అనంతరమాకాయలను మహావ్యాహృత్యుచ్చారణ పూర్వకముగా నామెయొడిలో నుంచును. కొందరు మహావ్యాహృతులతో

సీమన్తోన్నయనము చేసి మన్త్రరహితముగా నా కాయల నొడిలో నుంచవలయునందురు. పిమ్మట త్రివృతిఁ (తెల్ల తెగడ) దారముతోఁ గట్టిన కాయలను నామె కంఠమునఁ గట్టి వీణా గాథకులను "సోముని కీర్తింపు"డని యాజ్ఞాపించును. లేదా పరాక్రమవంతుఁడగు వీరుని కీర్తించుండని యాజ్ఞాపించును. అనంతరముదకపూర్ణ పాత్రమందు వ్రీహులను, యవలను గాని యుంచి "విష్ణుర్యోనిం కల్పయతు" అను యేఁడు ఋక్కులచేత నేడు చేరలా నీటిని వధువుచేఁ బ్రాశనము చేయించును. పిమ్మట నామె యాచమింపగా నామె యుదరమును సమన్త్రకముగా పతి తాకును. తరువాత నిత్యసంతుష్టయగు స్త్రీచే పాటలు పాడింతురు. తదుపరి బలీవర్దమును దక్షిణగానిచ్చి హోమశేషమును స్విష్టకృదాదిగా సమాప్తి గావింపనగు.

౨౩

కాకాదని, (కాకిదొండ) మేచకరాతిని (కామంచి) కోశాతికి (ఆవడ చెట్టు) బృహతి (వాకుడు) కాలక్లీతకము (నల్లగురువింద) వీని మూలములను గొనివచ్చి నూరి వధువు ప్రసవింపఁబోవు సూతికా గృహము [illegible]టకవలయును. దీని వలన నాయింట పిశాచాదులు ప్రవేశింపవు.

జాతకర్మ —

కుమారుఁడుదయించిన పిమ్మట నాభిచ్ఛేదనమునకుఁ బూర్వమే యగ్నియందాజ్యభాగాన్తకర్మ గావించి, మహావ్యాహృతులతో వేల్చి పిల్లవానిని మన్త్రరహితముగా ముమ్మాఱాఘ్రాణించి, తండ్రి యా శిశువుపై తన నిశ్వాసమును మూఁడు మంత్రములతో ముమ్మాఱు విడుచును. ఘృత మధువులను కలిపి, దధ్యుదకములను కలిపి, యా రెంటినొక పాత్రమునందు మిశ్రము చేయును. లేదా వ్రీహియవలను ప్రాశన యోగ్యముగా నూరును. ఈ రెంటిలో దేనినైనను సువర్ణముతో గ్రహించి సమంత్రకముగా పిల్లవానికి ప్రాశనము చేయించును. పిమ్మట నామధేయముంచును. ఆనామధేయమునకాదియందు క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ వర్ణములుండవలయు. మఱియు నా పేరు కృత్ప్రత్యయాంతముగ నుండవలయునే గాని తద్ధితప్రత్యయాంతముగ నుండరాదు. మిశ్రితతద్ధిత ప్రత్యయాంతముగను నుండరాదు. ఈ పేరు తల్లిదండ్రులకు మాత్రమే తెలిసియుండఁదగు. కాని వీనిని వారుచ్చరించరాదు. కొందరు తమ పూర్వపురుషులగు పితృపితామహ ప్రపితామహులకుఁగల నామధేయములనే యుంచవలయునందురు. ఇఁట

మూండు కేయులిట్లనుడివిరి. "బూడిదరంగుగల వృషభమునుండి బూడిదరంగుగల రోమము లను ఎత్తినిరోమములనుగ్రహించి ప్రాశనయోగ్యముగా నూరి పూర్వోక్తదధిమధు దధ్యుదకమిశ్రద్రవ్యమునఁగలిపి పూర్వమంత్రముచేతనే నాలుగుసార్లు ప్రాశనము చేయిం చవలయు. లేదా "భూర్ ఋగ్వేదం త్వయిదధామి" అను నాలుగు మంత్రములచే ప్రాశనము చేయించనగు.

కుమారుని కర్ణమున "వాక్ వాక్"అని మువ్మారు జపించినపిమ్మట నొక మంత్రము జపించనగు. పిదప జనపనాకతాడునకు బంగారువస్తువునుగుచ్చి పిల్లవాని దక్షిణహస్తమునకు కట్టనగు. పదనోకండవరోజున నాసువర్ణమును బ్రాహ్మణున కొసంగు నది. లేదా యింటియందుంచుకొనునది.

౨౫

నామకరణము:- ఏయగ్నియందు జాతకర్మహోమము చేయఁబడినదో దాని యందే నామకరణాంగ హోమము చేయఁదగినది. పదునోకండవరోజున నుదయముననే తలిదండ్రులు శిరస్నానమాచరించి నూతనవస్త్రధారులై పిల్లవానికి శిరస్నానము చేయించి జాతకాగ్నియందు స్థాలీపాకము చేసి జన్మతిథితో హోమము చేసినపిమ్మట జన్మ నక్షత్రమును తత్పూర్వోత్తర నక్షత్రములను నీమూఁడు నక్షత్రముల యధిదేవతల నుద్దేశించి హోమము చేయునది. పూర్వమధిదేవతాహుతి, పిమ్మట నక్షత్రాహుతి వేల్చవలెను. తరువాత సమంత్రకముగా మూఁడాహుతులు వేల్చనగు. ఇట్లు పదియాహు తులు వేయునది. పిమ్మట వెనుక ప్రకరణములో నిరూపించినట్లు కురసీయమమునను సరించి తనకునచ్చిననామము వ్యవహారార్థముంచి బ్రాహ్మణులచే స్వస్తివాచనము చేయించనగు. పిదప స్విష్టకృద్ధోమము చేసి యథాశక్తి దక్షిణలిచ్చి హోమతంత్రశేష మును పూర్తిగావించునది ఈ విధముగా పిల్లవానికి సంవత్సరము వచ్చునంతవరకు ప్రతి మాసము జాతకాగ్నియందుఁ జేయఁదగు. తరువాత ప్రతిసంవత్సరమున కుమారునకు గార్హ్యాగ్ని సిద్ధించునంతవరకు తండ్రి తనగృహ్యాగ్నియందు పూర్వోక్తకర్మ నాచరించు నది. కుమారునకు గార్హ్యాగ్ని సిద్ధించినతరువాత దానిచేతనే యతడు నామార్జనము చేయునగు.

౨౬

ఇరువదియేడు నక్షత్రముల కీరీతి నధిదేవతలుందురు. (1) కృత్తికకు అగ్ని (2) రోహిణికి ప్రజాపతి (3) మృగశిరకు సోముఁడు (4) ఆర్ద్రకు రుద్రుఁడు (5) పున

ర్వసువునకదితి (6) పుష్యమికి బృహస్పతి (7) ఆశ్లేషకు సర్పములు (8) మఘకు పితృదేవ
తలు (9) పూర్వఫల్గునికి భగుఁడు (10) ఉత్తరఫల్గునికి అర్యముఁడు (11) హస్తకు సవిత
(12) చిత్తకు త్వష్ట (13) స్వాతికి వాయువు (14) విశాఖకు ఇంద్రాగ్నులు (15) అనూ
రాధకు మిత్రుఁడు (16) జ్యేష్ఠకు ఇంద్రుఁడు (17) మూలకు నిర్ఋతి (18) పూర్వాషా
ఢకు ఉదకము (19) ఉత్తరాషాఢకు విశ్వేదేవులు (20) శ్రవణమునకు విష్ణువు (21) ధని
ష్ఠకు వసువులు (22) శతభిషమునకు వరుణుఁడు (23) పూర్వాభాద్రకు అజుఁడు (24)
ఉత్తరాభాద్రకు అహిర్బుధ్న్యుఁడు (25) రేవతికి పూషుఁడు (26) అశ్వినికశ్వినీదేవతలు
(27) భరణికి యముఁడు. వీనికి స్వాహాకారమంతమందుఁ జేర్చునది.

౨౭

కుమారునకు జన్మప్రభృతి యాఱవమాసమున నన్నప్రాశనము చేయఁదగు.
ఈ సంస్కారము లౌకికాగ్నియందు గృహమందే యాచరింపఁదగు. అగ్నియందాజ్య
భాగాన్తముచేసి సమంత్రకముగా నాల్గాహుతులు వేసి యొకమంత్రముచే కుమారునభి
మంత్రించి యుదగగ్రములగు కుశలపై ప్రాఙ్ముఖముగా కూర్చుండఁబెట్టునది. తండ్రి
దధిమధుఘృతమిశ్రమైన యన్నమును నాల్గువ్యాహృతులతో ప్రతిమంత్రమునకు నాల్గు
సారులుగా ప్రాశనము గావింపవలెను. కొందరు మహావ్యాహృతులచే ముమ్మారు ప్రాశ
నము చేయింపనగునందురు. ఇది నిత్యమైన శరీరసంస్కారము. తండ్రి పిల్లవాని నిమి
త్తమై అన్నాద్యకాముఁడైనచో మేకమాంసముతో మిశ్రితమైన యన్నమును, బ్రహ్మ
వర్చసకాముఁడైనచో తిత్తిరిమాంసమిశ్రితమైన యన్నమును, జవనకాముఁడైనచో
మత్స్యమాంస మిశ్రమైన యన్నమును, తేజస్కాముఁడైనచో ఘృతాన్నమును, శుద్ధా
న్నముతో గలిపి ప్రాశనము చేయింపవలయు. తరువాత హోమశేషమును పూర్తి
గావించునది. మిగిలినదానిని తల్లి ప్రాశనము చేయునది.

౨౮

కుమారునకు జన్మప్రభృతి సంవత్సరాంతమందుగాని మూడవ సంవత్సర
మునగాని చూడాకర్మయను సంస్కారమాచరింపనగు. ఇది గృహబహిర్భాగమున
లౌకికాగ్నియందు చేయఁదగు. క్షత్రియునకు పంచమవర్షమున, వైశ్యున కైదవయేట,
నుచితము. ఉపలేపనోల్లేఖాద్యాజ్య భాగాన్తముచేసి వ్రీహి, యవ, తిల, మాషము
లచే నాల్గు పాత్రములను ప్రత్యేకముగా పూరించి యుంచునది. బలీవర్దచర్మము, గోమ
యము, యవలు, తిలలు, కుశఖండ సహితమగు మృత్పిండమునందుంచఁబడిన యద్దము,

లోహపుకత్తి ఈ ద్రవ్యములగ్ని కుదగ్భాగమున నుంచఁదగు. మహావ్యాహృతిచతుష్ట యముతో హోమముచేసి బలీవర్దచర్మముపైఁ గుమారుని కూర్చుండఁబెట్టి సమంత్ర కముగా వేడినీటిలో శీతలోదకము కలుపును. పిమ్మట కుమారనామోపలక్షితమైన యొకమంత్రమును ముమ్మారుచ్చరించుచు కుమారుని శిరమున దక్షిణపార్శ్వ కేశము లను కొన్నింటిని పూర్వము కలిపియుంచిన నీటిచే ముమ్మారు తడుపును. ఈ తడిపిన కేశములను కొందరు యేదుబంది ముఁటితో పాయలుఁగా దీయుదురు. ఆ కేశములను మంత్రరహితముగా నవనీతముచే మర్దించి యా ప్రదేశమున సమంత్రకముగా లేఁతకుశ నొకదాని నుంచును. పిమ్మట నా కేశకుశ ఖండములను ఒకసారిగా సద్దముతో తాఁకును. సమంత్రకముగా లోహపుకత్తిని గ్రహించును. తరువాత వానిని కుశఖండ సహితముగా కుమారనామోపలక్షితమైన యొక మంత్రముచే ఛేదించి, కుశసహితమగు మృత్పిండ మందలి గోమయమునందుంచును. ఇట్లు రెండవ ఛేదనము, మూడవ ఛేదనముచేసి గోవును దక్షిణముగానిచ్చి నూతనవస్త్రము నిచ్చును. తరువాత నీరీతిగా నుత్తరవైపున రెండు ఛేదనములు చేయును. అనంతరము అంబష్ఠునిచే స్వకులాచారము ననుసరించి ముండ నము చేయించును. తరువాత హోమశేషము పూర్తిగావించును. వ్రీహ్యాదిపూర్ణము లగుపాత్ర చతుష్టయమునంబష్ఠునకిచ్చును. ఓషధీసంపన్నమగుప్రదేశమునగాని యుదక సమీపమునగాని భూమియందు పాతిపెట్టవలయు. కన్యలకు మంత్రరహితముగా నీ సంస్కారము చేయఁదగినది. పదునారవయేటగాని పదునెనిమిదవయేటగాని గోదాన కర్మ నీ చూడాకర్మవలెనే చేయునది. కాని దానియందు రెండు ఛేదనము లధికము.

ప్రథమాధ్యాయము సమాప్తము.

# ద్వితీయాధ్యాయము

౧

గర్భాష్టమవర్షమునగాని, గర్భ దశమ సంవత్సరమునగాని నల్లజింక చర్మముచే బ్రాహ్మణున కుపనయనముగావింపనగు. గర్భైకాదశ సంవత్సరమున నల్లచారల దుప్పిచర్మముచే క్షత్రియునకు, గర్భ ద్వాదశవర్షమున గోచర్మముచే వైశ్యునకు నుపనయనము గావించునది. పూర్వోక్త కాలములకు రెట్టింపు కాలమువఱకు నాయా జాతులకుపనయనార్హత యుండును. ఆపైన వారు సావిత్ర్యుపదేశమున కనర్హులు. కావున వారి కుపనయనము కూడదు. వారిచే యాగము చేయింపగూడదు. వారితో వ్యవహరింపరాదు.

వారందఱిని నూతన వస్త్రములచేత, నుపనీతుల గావింపవచ్చు. బ్రాహ్మణునకు ముంజగడ్డితాడు, క్షత్రియునకు వింటినారి, వైశ్యునకు ఉన్నితాడు మేఖలలగుచున్నవి. బ్రాహ్మణునకు మోదుగకఱ్ఱగాని, మారేడు కఱ్ఱగాని, క్షత్రియునకు మఱ్ఱికఱ్ఱ, వైశ్యునకు మేడికఱ్ఱ దండములుగా గ్రహింపదగు. ఆ దండము బ్రాహ్మణునకు నాసికాగ్ర సమానము, క్షత్రియునకు ఫాలభాగసమ్మితము, వైశ్యునకు కేశపర్యంతము నుండును. లేదా యందఱకు నన్నిదండము లివ్వవచ్చు.

ఆచార్యాధీనునిగా బొందించు వానిని ముండనము చేయించి స్నానమాచరింపఁజేసి యలంకరింపవలయు. పిమ్మట నగ్నికిఁ బశ్చిమ భాగమునఁ బశ్చిమాభిముఖుఁడై యున్న వానికెదురుగా నాచార్యుఁడు పూర్వాభిముఖుఁడై యుండి యుపనయనము గావించును.

౨

ఆచార్యుఁడు ముంజిగడ్డిచే ముప్పేటగా పేనిన త్రాటిని బ్రహ్మచారికటి ప్రదేశమున మూఁడు వరుసలు చుట్టును. అవి తొమ్మిది పేటలగును. దానికి గోత్రానుసారముగా ప్రవరఋషి సంఖ్యనుబట్టి ఒకటి, మూడు, ఐదు ముళ్ళు వేయును. పిమ్మట "మిత్రస్యచక్షుర్ధరుణంబలీయః" అను మంత్రముచేత యజ్ఞోపవీతము వేయును. తరువాత తన యంజలితో, బ్రహ్మచారి యంజలిని జలముచేపూరించి "నీవెవరవు" అని యడుగును. బ్రహ్మచారి "నేను సమానఋషులు కలవాఁడను" అని తనపేరును చెప్పును,

"బ్రహ్మచారిని అని పలుకుము" అని యాచార్యుఁడు చెప్పును. "నేను బ్రహ్మచారిని" అని బ్రహ్మచారి పల్కును. పిమ్మట ఆచార్యుఁడు బ్రహ్మచారి యంజలిలో మూఁడు దోసిళ్ళ నుదకము సమంత్రకముగా వదిలి, తన రెండు చేతులతో బ్రహ్మచారి హస్తద్వయమునుగ్రహించి బ్రహ్మచారి నామోపలక్షితమగు మంత్రములు జపించును. వానిని బ్రహ్మచారిసమూహమున కధిపతి గావింపనెంచినచో "గణానాంత్వాగణపతిం" అను మంత్రము నాచార్యుఁడు జపించును. బ్రహ్మచారి క్షత్రియుఁడైనచో నొకమంత్ర మునుచ్చరించును. బ్రహ్మచారి వ్యాధిపీడితుఁడైనచో మహావ్యాహృతి చతుష్టయము నుచ్చరించును.

౩

ఆచార్యుఁడు బ్రహ్మచారి హస్తముల నట్లేపట్టుకొని బ్రహ్మచారి నామాంతముగా నొకమంత్రమును జపించును. మరియొకమంత్రమును జపించుచు బ్రహ్మచారిని ప్రదక్షిణముగా త్రిప్పి ప్రాఙ్ముఖుని చేయును. ఆచార్యుఁడు బ్రహ్మచారి దక్షిణభుజముపై తనచేతినుంచి యొకమంత్రమును జపించుచు బ్రహ్మచారిహృదయమును స్పృశించి పిమ్మట నమంత్రకముగా బ్రహ్మచారిని ప్రదక్షిణముగా త్రిప్పి తనయెదుట నాసీనుం గావించి వాని హృదయప్రదేశమున తన హస్తము నూర్ధ్వాంగుళిగా నుంచును.

౪

ఆరీతిగా తనహస్తమునుంచి యొకమంత్రమును జపించును. మరల బ్రహ్మచారిచే సవ్యముగా ప్రదక్షిణము చేయించి ప్రాఙ్ముఖునిగా చేసి మరల వాని దక్షిణ భుజమును తన కుడిచేతితో పట్టుకొని యొకమంత్రమును జపించును. పిమ్మట బ్రహ్మచారి యగ్నియందు సమిధను సమంత్రకముగానుంచును. అమంత్రకముగానైన నుంచవచ్చును.

౫

సావిత్ర్యనువచనము:- సంవత్సర సావిత్ర్యనువచనము త్రిరాత్ర సావిత్ర్యను వచనము, అన్వక్ష సావిత్ర్యనువచనము అని మూఁడుపక్షములు గలవు. కాని శిష్టులచే నన్వక్షపక్షమే ఆదరింపఁబడుచున్నది. బ్రాహ్మణులకు గాయత్రీ ఛందస్సు, క్షత్రియులకు త్రిష్టుప్ఛందస్సు, వైశ్యునకు జగతీఛందస్సు ఉపదేశింపఁదగినది. అగ్ని కుదగ్భాగమున ప్రాఙ్ముఖముగా నాచార్యుఁడు, ప్రత్యఙ్ముఖముగా బ్రహ్మచారి కూర్చుందురు.

ఆచార్యుడు బ్రహ్మచారిచే "అధీహిభోః" అని పలికించి తాను "ఓం" అని పలికి "తత్సవితుర్వరేణ్యం" అని సావిత్రిని ప్రథమమున పాదపాదములుగా, నర్ధర్ధార్ధర్చములుగా సమస్తముగా పఠింపఁజేయును. మధ్యవిరామము పనికిరాదు. ఇట్లే వర్ణత్రియమున నుపదేశించునది.

౬.

ఒక మంత్రముచే ముమ్మారాచమనము చేసినపిమ్మట స్వస్తిసూక్తమును పఠించుచు దండము నిచ్చును. బ్రహ్మచారి యాచార్యునకు దక్షిణగా గోవునిచ్చును. ఆచార్యుఁడు బ్రహ్మచారి నగ్నికి బ్రదక్షిణము చేయించి మహావ్యాహృతులను వేల్చి స్విష్టకృదాది హోమమంత్రమును బూర్తిగావించును. అనంతరము బ్రహ్మచారి భిక్షాటనముచేయును. "భవతీ భిక్షాం దదాతు" అని ప్రథమమున తల్లినే యర్థింపవలయు. [illegible] భిక్షను తిరస్కరింపక పెట్టు మఱియొక స్త్రీనైనను యాచింపవలయు. భోజన పర్యాప్తమైన భిక్షను చేకూర్చుకొని దాని నాచార్యునకు సమర్పించి అనుజ్ఞఁబొంది [illegible]పనగు. అగ్నికార్యము, భిక్షాచరణము, అధఃశయ్య, గురుశుశ్రూష బ్రహ్మచారికి నిత్యము కర్తవ్యములు. బ్రహ్మచారి క్షత్రియుఁడైనచో "భిక్షాంభవతీ దదాతు" అని వైశ్యుఁడైనచో "భిక్షాం దదాతు భవతీ" అని భిక్ష నర్థింపవలయు.

౭

అనువచనము:- అగ్ని కుదగ్భాగమున పశ్చిమాభిముఖుఁడై యున్న బ్రహ్మచారి ప్రాఙ్ముఖముగా నుపవిష్టుఁడై యున్న యాచార్యుని పాదముల కభివాదనముచేయును. పిమ్మట బ్రహ్మచారి హస్తప్రక్షాళనము చేసికొని ముష్టి ప్రమాణముగల కుశలమధ్య భాగమును తన రెండుచేతులతో గ్రహించి వాని మూలభాగమును తన కుడిమోకాటి క్రిందనుంచుకొని యుండును. తదనంతర మాచార్యుఁడా కుశాగ్రభాగముల నెడమ చేతితోఁ బట్టుకొని కుడిచేతితో వృషభగోమయ కుండమునుండి జలమును గ్రహించి బ్రహ్మచారిని ప్రోక్షించుచు నీరీతిని బలికించును.

"సావిత్రిని, గాయత్రిని, వైశ్వామిత్రిని, ఋషులను, దేవతలను, ఛందస్సుల శ్రద్ధామేధలను అనుప్రవచనము చేయుడు" అని ఈమాటలను బ్రహ్మచారి పలుకును. ఆచార్యుఁడట్లే అనుప్రవచనము చేసెదని సమాధానము చెప్పును.

తదనంతరము యే ఋషిమంత్రము యేదేవతకలదో యే ఛందస్సు కలదో, ఆచార్యుఁడు చెప్పుచు సకలసంహితను పాఠక్రమముగా బ్రహ్మచారిచే పలి

కింపఁ జేయును. లేదా యాచార్యుఁడు ఋషిఛందాదికము తెలియని వాఁడైనచో "తత్సవితుర్వరేణ్యం" అను ఋక్కును మూడు పాదములుగా, రెండర్ధర్చములుగా సమస్తముగా చెప్పి యనువదింపఁ జేయును. ఈ రీతిగా బోధించునపుడెనిమిది యక్షరముల నొక్కొక్క పాదముగా, మొదటి రెండు పాదములు పూర్వార్ధర్చము, మూడవపాదము రెండవయర్ధర్చముగా గ్రహించునది. లేదా ఒక్కొక్క ఋషిగల యనువాకము చొప్పునైనను జెప్పవచ్చును. క్షుద్ర సూక్తముల విషయమున ననువాకము మాత్రముగానే చెప్పనగు. లేదా బ్రహ్మచారి యెంతవఱకు చెప్పుకొన శక్తిగలవాఁడో యంతవఱకు గురువు చెప్పుచు సంహితను సమాప్తిని గావింపవచ్చు. లేదా ఒక్కొక్కఋషి యొక్క ఆద్యంతసూక్తములను చెప్పి సంహితను పూర్తిగావించునది. లేదా అనువాకములతో నాద్యంతసూక్తములను చెప్పి పూర్తిగావింపవచ్చు. లేదా ప్రతి సూక్తమునకాదిఋక్కును చెప్పి "ఈ సూక్తమునకిది మొదటిఋక్కు, దీనిక్రమమిది. ఈ ప్రకారము సూక్తముండును" అని బోధింపవచ్చు.

పిమ్మట పూర్వోక్తకుశలను తీసికొని వృషభగోమయముతో నీళ్ళు నిలుచునట్లొకకుండమును నిర్మించి కుశల మొదటిభాగము నందుపాతి, యాకుండమున నీళ్ళునింపి యాజలముతో నాకుశలను తడుపవలయు.

౮

అనుప్రవచన మొనర్చినదినము నపరాహ్ణమందే క్షతములుగాని యటుకులను భిక్షనెత్తి యగ్నియందాజ్యభాగాంత కర్మనొనరించి యందు "సదసస్పతిమద్భుత" మను సూక్తముచే ప్రతిఋక్కునకు నాల్గాహుతుల చొప్పున వేల్చునది. తరువాత బ్రహ్మచారి యాచార్యునివద్ద భిక్షమెత్తి "స్వస్తిపలుకు"డని యడుగును. ఆచార్యుఁడు "ఓంస్వస్తి"అని వాక్రుచ్చును.

౯

అహరహము సాయంప్రాతఃకాలములందు సంధ్యోపాసనకర్మ చేయఁదగిది. వాఙ్నియమముగలవాఁడై గ్రామము వెలుపల ఈశాన్యదిక్కునందు జేరి యాదిత్యుఁడు సగమస్తమించినపిమ్మట ప్రాణాయామమాచరించి మార్జనముచేసి యుత్తరాభిముఖుఁడై, దోసిలొగ్గి నక్షత్రదర్శనమగువరకు సావిత్రీజపము చేయునది. సంధ్యాకాల మతిక్రమించిన పిమ్మట మహావ్యాహృతులను సావిత్రిని, స్వస్త్యయన మంత్రములను జపించునది. ఇట్లే ప్రాతఃకాలమున ప్రాఙ్ముఖుఁడై నక్షత్రములు కనఁబడుచుండగా నిలబడి సూర్యోదయమగునంతవరకు సావిత్రీజపముచేసి తరువాతి కార్యమును చేయునది.

౧౦

అహరహము సాయంప్రాతఃకాలములందు అగ్నికర్మ నాచరింపవలయు. అగ్నిని ప్రజ్వలింపఁజేసి పరిసమూహనము, పర్యుక్షణము గావించి కుడిమోకాలిని భూమికిఁ దాకించి నాల్గుమంత్రములచే నాలుగు సమిధల నగ్నియందుంచునది. పిమ్మట నగ్నికి పర్యుక్షణము చేసి యొకమంత్రముచే నగ్న్యుపస్థానము చేయఁదగు. తరువాత సావర్ణ వ్రతమునందు చెప్పబడి లోకదృష్టమగుచు వృద్ధసంప్రదాయానుష్ఠితముల "త్ర్యాయుషంజమదగ్నే" అను నైదుమంత్రములచే ప్రతిమంత్రము, లలాటము, హృదయము, దక్షిణభుజము, ఉత్తరభుజము, పృష్ఠభాగము అను నీ యైదుస్థానములందు భస్మముచే త్రిపుండ్రధారణము చేయఁదగు. వేదములలో నొకటిగాని రెండుగాని మూడుగాని నాల్గుగాని వేదముల నధ్యయనము చేయును.

౧౧

వ్రతాదేశము:—

ఉత్తరాయణమున శుక్లపక్షమందు అహోరాత్రము బ్రహ్మచర్య మవలంబించి యాచార్యుఁడు చతుర్దశి, పంచదశి (అమావాస్య, పౌర్ణమాసి) పాడ్యమి, అష్టమి అను నాల్గు తిథులను వదిలి శుభనక్షత్రయుక్తమైన శుభతిథియందు శుక్రియవ్రత బ్రహ్మచర్యము నుపదేశింపవలయు. ఆ బ్రహ్మచర్యము త్రిరాత్రముగాని, ద్వాదశ రాత్రముగాని సంవత్సరముగాని యాచార్యుని యాదేశమననుసరించి యవలంబింపఁదగినది. శాక్వరవ్రతము మాత్రము సంవత్సరము. వ్రాత్యవ్రతము, ఉపనిషద్వ్రతము గూడ నిట్లే యాచరించునది. రెండుమంత్రములనుచెప్పి వేదముచెప్పి తద్రహస్యము వినిపించుచు కాలనియమము నాదేశించి కనిపెట్టి యుండవలయు. ఈ శుక్రియవ్రతమునకు నుదీక్షణికయనియు పేరుగలదు.

౧౨

అపరాహ్ణకాలమున నీశాన్యదిశయందు హోమకర్మ నాచరించిన యాచార్యుఁడు "సర్వదేవతల విషయమై నీబ్రహ్మచర్యము నిర్వర్తింపఁబడినదా" యని బ్రహ్మచారిని ప్రశ్నింపగా నాతఁడు "నిర్వర్తింపఁబడినద"ని సమాధానము చెప్పును. అగ్నికిఁ బశ్చిమభాగమున నాచార్యునకుముందు బ్రహ్మచారి ప్రాఙ్ముఖముగా నుపవిష్టుఁడై యుండును. ఆచార్యుఁడు నూతనవస్త్రముచే బ్రహ్మచారి ముఖమునకు ప్రదక్షిణముగా మూడుచుట్లు చుట్టును. ఆ వస్త్రము నేత్రములకు పైభాగమును తాకుచు నడ్డముగా

జారకుండునట్లుండును. పిమ్మట నాచార్యుఁడు "త్రిరాత్రము, సమిదాధానము, భిక్షా
చరణము అధఃశయ్య, గురుశుశ్రూష నొనరించుచు వాఙ్నియమము గలవాడవై జాగ
రూకుఁడవై దేవకులమునందుగాని యగ్నిహోత్ర సమీపమునగాని ఉపవసింపుము"అని
బ్రహ్మచారిని శాసించును. కొందరీనియమము లహోరాత్రమే యందురు. పిమ్మట
మహావ్యాహృతి సర్వప్రాయశ్చిత్తాది తంత్రశేషమును పూర్తిగావించును. ఆచార్యుఁడు
బ్రహ్మచారియు, త్రిరాత్రముగాని. అహోరాత్రముగాని నియమ సహితముగ గడిపి
గ్రామమునుండి బయలువెడలి పచ్చిమాంసమును, చండాలుని, ప్రసవించిన స్త్రీని,
ఋతుమతియైన స్త్రీని, రక్తముతోనున్న హస్తములుకలవానిని, శ్మశానమును, సర్వ
విధములైన శవములను, వీనిలో దేనిఁజూచినను మరలిరావలయు. పిమ్మట సూర్యో
దయముకాకమునుపే యొక పుణ్యప్రదేశమునుపొంది అనువచన ధర్మముతో వాఙ్నియ
మముగలిగి తలగుడ్డనుధరించిన బ్రహ్మచారి కాచార్యుఁడనుప్రవచనము చేయవలయు.
బ్రహ్మచారి తలగుడ్డను, భోజనమును దక్షిణగానాచార్యున కొసంగును. లేదా గోవు
నిచ్చును. ఆచార్యుఁడు దక్షిణను సమంత్రకముగా స్వీకరించును. ఇఁటకొందరు విశ్వదేవ
తాకమగు చరువును చేయుదురు.

౧౩

దండనియమములు:- బ్రహ్మచారి తనకు తనదండమునకు మధ్యగా నితరు
లను వెళ్లనివ్వరాదు. దండము, మేఖల, యజ్ఞోపవీతము ఇవి విరిగినను తెగిపోయినను
ప్రాయశ్చిత్తము చేసికొనునది. దండము విరిగినచో మరల దండమును గ్రహించునది.
మేఖల, యజ్ఞోపవీతములుముడివేసి, ధరించుటకు వీలులేనిచో క్రొత్తవానినిధరించి, స్వయ
ముగా ననుమంత్రించుకొనవలయు. ప్రాతవానిని తనదండమునకుఁజుట్టి శుక్రియాది వ్రత
ములలో నొకటి పూర్తియగువఱకు ధరించి వ్రతసమాప్తియైన పిమ్మట దండ, మేఖల
యజ్ఞోపవీతములను నీటియందు సమంత్రకముగా పడవేయవలయు.

౧౪

వైశ్వదేవము:- ఇదిగార్హ్యాగ్ని కలవాడు చేయదగినది. ఇంటియందు
సర్వవిధముల సిద్ధమైన అన్నము గ్రహించునది. కాని ఆరిగలు మాషాదులు
హవిష్యముకాగూడదు. అట్టియన్నమును పాత్రయందు గ్రహించి అగ్నిని ప్రజ్వ
లింపఁజేసి పరిసమూహనము పర్యుక్షణము లొనరించి కుడిమోకాలును, భూమికితాకించి
సమిదాధానముచేసి చేతితో, నీరీతిగా వేల్చవలయును. అగ్ని, సోముఁడు, ఇంద్రాగ్నులు,

విష్ణువు, భరద్వాజుడు, ధన్వంతరి, విశ్వేదేవులు, ప్రజాపతి, అదితి, అనుమతి, స్విష్టకృత్తు యీ పదియాహుతులను వేయునది. పిమ్మట సమిధనుంచి పర్యుక్షణము చేసి హుతశేషాన్నమును జలముచేతడిపి నట్టింటభూమియందు ఈరీతిగా బలివేయునది. సమంత్రకముగా పూర్వోక్త దేవతలనుద్దేశించి బలివేసి, బ్రహ్మపురుషులకు, వాస్తోష్పతికిని గృహమధ్యభాగమునబలివేసి యాబలికినలువైపుల నాయాదేవతలకు తత్తత్పురుషులకుబలివేయునది. బృహస్పతికి తత్పురుషులకు నూర్ధ్వభాగమున బలివేయునది. పిమ్మట ఆదిత్యాకారముగ గోమయముతో మండలముచేసి యందు ఆదిత్యుడు, ఆదిత్యపురుషులు, నక్షత్రములు, ఋతువులు, మాసములు, పక్షములు, అహోరాత్రములు, సంవత్సరములు. ధాత,విధాత, పూషుడు, మరుత్తులు, అనువారికి పండ్రెండుబలులు వేయునది. తిరుగలియందు విష్ణువునకు, ఉలూఖలమునందు వనస్పతికి, ధాన్యములున్నచోట ఓషధులకు. నీటికడవ దగ్గర పర్జన్యునకు, శయ్యయందు జలమునకు, తలగడయందు శ్రీకి, పాదములచెంత భద్రకాళికి మూత్రపురీషములు విడుచుప్రదేశమున సర్వభూతపతికి, అస్తరిక్షమున సాయంకాలమున నక్తంచరులకు, ప్రాతఃకాలమున దివాచరులకు, మండలమునకు నుత్తరభాగమున అవిజ్ఞాతదేవతలకు, కుబేరునకును, ప్రాచీనావీతియై మండలమునకు దక్షిణభాగమున పితృదేవతలకు "యేఅగ్ని" అనుమంత్రమును స్వధాన్తముగా శేషాన్నమునుంచవలయు.

వైశ్వదేవాంతమున శ్రోత్రియుడగు బ్రాహ్మణునకు భోజనమిడవలయు. పిమ్మట బ్రహ్మచారికి భిక్షనొసంగునది, తరువాత సువాసినిని గర్భిణిని, బాలురను, వృద్ధులను, భుజింపజేయునది శ్వానములకు శ్వపాకులకు భోజనము పెట్టవలయు. అపదానముచేయనియన్నముతినరాదు.ఒంటరిగాభుజింపరాదు. ప్రథమముగభుజింపగూడదు.

౧౫

అర్ఘ్యదానసమయమున నైంద్రాది శాఖాపశుకర్మలు చేయునది. అర్ఘ్యార్హులారుగురు. ఉపనయనముచేసి సమస్తవేదోపదేశముచేసిన వాడగునాచార్యుడు, అహోరాత్రికర్మ నాచరించినవాడగు ఋత్విక్కు, గురువు, సార్వభౌముడగురాజు, సమావర్తనము చేసికొని యారోజుననే వచ్చినట్టి బ్రహ్మచారి, కన్యను వివాహమాడుటకే తెంచిన వాడగు జామాత.

వీరిలో నెవరేతెంచినను వీరికి గోవునుగాని, పశువునుగాని, లభించనిచో గోపశువులకు ప్రతినిధిగా మాంససదృశమైన మధురాన్నమునుగాని నివ్వవలయు. గోపశువుఁను చేయఁదలచినచో నాచార్యున కగ్నిదేవతాకము, ఋత్విక్కునకు బృహస్పతి దేవ

తాకము, శ్వశురునకు ప్రజాపతి దేవతాకము, రాజున కింద్రదేవతాకము, జామాతకు మిత్రదేవతాకము, స్నాతకున కింద్రాగ్ని దేవతాకమునగు దానిని చేయవలయు. సంవత్సరము దాటినతరువాత నాచార్యాదులలో నెవ్వరువచ్చినను శాఖాపశువులు చేయవలయు. కాని సంవత్సరములోపలనే సోమయాగము పూర్తిగావించిగాని వివాహ నిమిత్తముగాని వచ్చినవానికి శాఖాపశువులు మరల చేయదగినవి.

౧౬

మధుపర్కము, సోమయాగము, పితృదైవతకర్మ, వీనియందే, పశువును హింసింపవలయుగాని మరియొకప్పుడు కూడదని మనువుభావము. ఆచార్యుడు, తండ్రి, స్నేహితుడు ఈ ముగ్గురు గృహస్థున కతిథులుగారు. ఈ ముగ్గురేమిచెప్పిన నది యవశ్యముచేయుట ధర్మము. భార్యాగ్నియుక్తుడై వైశ్వదేవకాలమున కేతెంచిన వాడతిథి నాబడు. ఏకగ్రామనివాసిమాత్రము కాగూడదు. గ్రామాంతరము వెళ్ళి తిరిగివచ్చిన వాడు, ఇంటియందున్నవాడు, వీరివతిథులుగా భావింపరాదు. అగ్నిహోత్రము, ఒలీవర్ధములు, సకాలమునకువచ్చిన యతిథి, అల్లీ యింటికేతెంచిన బాలుడు, వలవృద్ధులు, అవమానింపబడిరేని చెడుగు చేకూర్తురు.

వృషభము, బ్రహ్మచారి, అగ్నిహోత్రము. ఈ మువ్వురు తినకుండిన సిద్ధిని చేకూర్పరు. గృహ్యదేవతలు అనుదినమును గృహస్థుని తమ హవిర్భాగ నిమిత్తము సమీపింతురుగాన వారికిడుట ముఖ్యము.

౧౭

ఉఞ్ఛాది వృత్తితో జీవించుచున్నను నిత్యాగ్నిహోత్రియయినను, తన యింటికివచ్చిన యతిథిని పూజింపకున్న తాను సుకృతమెల్లను గోల్పోవును. చివరకి నుదకమునైనను దానముచేయనగు. ఒక సమిధనైనను హోమము చేయవలయు. ఒక సూక్తమునైన ఒక యనువాకమునైనను జపించి బ్రహ్మయజ్ఞము చేయునది. యజమానుడు గ్రామాంతరమేగినను భార్య వ్రతధారణము చేయనగుగాన నగ్నులకుపవాసము తగదు. పుత్రుడు, సోదరుడు, పత్ని, శిష్యుడు, వీరిలో నెవ్వరైనను బలివేయునగు. ఇట్లవిచ్ఛిన్నముగ వైశ్వదేవమును చేయువారు, అర్థము, ఆయుస్సు, కీర్తి, సంతానము, వీనితో నభివృద్ధి చెందెదరు.

౧౮

బ్రహ్మచారి ప్రవాసమునకు వెళ్ళదలచినవాడై గుర్వనుజ్ఞ వేడును. పిమ్మట నాచార్యుడు బ్రహ్మచారి రక్షకముగా నొకమంత్రము జపించి స్వస్తి పలుకును.

# తృతీయాధ్యాయము

౧

సమావర్తనకర్మ:— ఉపలేపనాద్యాజ్యభాగాన్తకర్మ నొనరించి మహావ్యాహృతులను వేల్చి యెఱ్ఱని బలీవర్దచర్మమందు బ్రహ్మచారిని కూర్చుండఁబెట్టుదురు. కేశములను శ్మశ్రువులను ముండనముచేయించి, నఖములను తీయింతురు. పిమ్మట వ్రీహి, యవ, తిల, సర్షపములను మెత్తగానూరి నలుగుపెట్టుదురు. తరువాత యుత్తరేని గింజలను, శంఖపుష్పిని, నూరి నలుగుపెట్టుదురు. అనంతరము లౌకికస్నానము చేయించి "ఆపోహిష్ఠామయోభువః" అను తొమ్మిది ఋక్కులతో తొమ్మిదికడవలనీళ్ళు పోయుదురు. యథావిభవముగా బ్రహ్మచారి నలంకరించి సమంత్రకముగ నూతనవస్త్రముల నిచ్చి సమంత్రకముగా వక్షస్థలమందు భూషణము గట్టుదురు. మఱియు నతనికి తలగుడ్డ, గొడుగు, చెప్పులు, వైణవదండమును సమంత్రకముగనిత్తురు. అనంతరమా బ్రహ్మచారి మహావ్యాహృత్యాహుతులు వేల్చి హోమకర్మను పూర్తిగావించును. తరువాత రెండు మంత్రములు పఠించుచు కుడికాలుముందుంచి రథమునధిరోహించును. తనరాకనుచూచి గోవుచేగాని, పసువుచేగాని యెవరు మధుపర్కమునిచ్చి యాదరింతురో వారియింటికి వెళ్ళును. లేదా గోవు, ఫలము, వనము, వృక్షము వీనినిజూచి స్వగృహమునకుఁదిరిగి వచ్చును. రెండుమంత్రములుచ్చరించుచు రథమునుదిగి వెనుక తాను ధరించిన వస్త్రోష్ణీషాముల నాచార్యునకు సమర్పించును.

౨

గృహకర్మ:— ఏప్రదేశము గృహమునిర్మింపఁదలచెనో యచ్చోట నాభూమిని సమంత్రకముగా మేడికఱ్ఱతో త్రవ్వి, శోధించి హోమము చేయునది. అగ్నిని ప్రతిష్ఠించి యాజ్యభాగాన్తముచేసి సమంత్రకముగా నాజ్యాహుతులు రెండు వేల్చి హోమకర్మ పూర్తిగావింపనగు. పిమ్మట గృహనిర్మాణ ప్రదేశమున నలువైపులద్వార నిర్ణయము చేసి ప్రతిద్వారమున కిరువైపుల రెండుగుంటలుత్రవ్వునది. గృహమధ్యమున నొకగుంట త్రవ్వగా నవి తొమ్మిదియగు. పిమ్మట నాగర్తములయందు ఘృతమిశ్రమైన జలమును పోయునది. వానియందుంచు తొమ్మిది స్తంభముల మూలములను నేతితో తడుపునది. ప్రతిద్వారమునకు కుడివైపుగుంటయందు, తరువాత యెడమవైపు గుంటయందు, నీరీతిగా నాల్గువైపుల స్తంభములను పాతి మధ్యగుంటయందు మధ్యస్తంభమును పాతవలయు.

౩

వానిని పాతినవరుసగా తత్తన్మంత్రములతో స్పృశించునది. ఈలోపల గృహ మధ్యమున మట్టిదిబ్బ నొకదానినిచేసియుంచి తుదకుదానినిగూడ సమంత్రకముగా స్పృశించునది. మరియొకమంత్రము నావర్తించుచు ద్వారదేశములను, మరియొకమంత్రముచే తలుపులను, తాకి నేతితో తడిపిన యొకపాషాణమును మట్టిదిబ్బక్రింద త్రవ్వి సమంత్రకముగా నందు దానినుంచునది.

౪

గృహప్రవేశము–: గార్హ్యాగ్నియందు అభ్యుక్షణాంతముచేసి పిమ్మట నూతన గృహమున ద్వారమునకు వెలుపల యగ్నినిలిపి పరిసమూహనముచేసి యాయగ్నికి నుత్తరభాగమున ప్రాగగ్రములగు దర్భలపై నుదకకుంభమునుంచును. సమంత్రకముగా నందుజలముపోసి యభిమంత్రించి ఆఘారాజ్యభాగాంతమొనరించి పూర్వాహ్ణమున మూండాహుతులను వేయును. హోమకర్మ పూర్తిగావించును. పిమ్మట మధ్యాహ్నమా యగ్నియందే పరిసమూహనాదులు చేసి మూడు ఋగాహుతులు వేసి హోమప్రక్రియ పూర్తి చేయునది. పిమ్మట నాయగ్నియందే యపరాహ్ణమున నాజ్యభాగాంతకర్మ చేసి వాస్తోష్పతినుద్దేశించి గ్రహాంతఃప్రోక్షణము లాచరించి స్థాలీపాకమువండి మహావ్యాహృతులు నాల్గు మరికొన్నిమంత్రములచే నైదు మొత్తము తొమ్మిది యాహుతులు వేసి, స్విష్టకృత్తునొనరించి యాచార్యునకు దక్షిణయివ్వందగు. పిమ్మట జ్యేష్ఠపుత్రునితో, తనభార్యతోకలిసి పూర్వోక్తోదకుంభమును గ్రహించి, నూతనగృహమును ప్రవేశించునది. పిమ్మట హోమకర్మ పూర్తిగావించునది

౫

ఏదియైన నొకనొక ప్రయోజనముగోరి గ్రామమునుండి బయలుదేరం దలచినపుడు ''శగ్మం శగ్మః'' అను మంత్రమును జపించుచు బయలుదేరవలయు. పోయిన పని నెరవేరిన పిమ్మట గ్రామమును ప్రవేశించునపుడు మఱియొక మంత్రమును జపించుచు ప్రవేశింపనగు. గృహమును ప్రవేశించిన తరువాత మఱియొక మంత్రము జపించునది.

౬

అనాహితాగ్నియైనవాడు ప్రవాసమునకేగువాడై యొక మంత్రముతో కుటుంబము నీక్షించి మఱియొక మంత్రము జపించుచు వెళ్ళును.

౭

ప్రవాసమునుండి వచ్చినవాఁడై కుటుంబము నొక మంత్రము జపించుచు దర్శించును. పిమ్మట గార్హ్యాగ్ని నొక మంత్రముచే స్తోత్రము చేయును. సమంత్రక ముగా పాద్యమును గ్రహించును.

౮

అనాహితాగ్ని నవాన్నమును భుజింపఁదలచినవాఁడు కాగా స్థాలీపాకము వండి యాగ్రయణ దేవతలను నింద్రాగ్నులకు, విశ్వేదేవులకు, ద్యావాపృథివులకు గ్రహణప్రోక్షణములు చేయును. అగ్నినిప్రతిష్ఠించి యాజ్యభాగాంతముచేసి స్వాహాంత ముగ పూర్వోక్తదేవతలకు మూఁడాహుతులు వేసి స్విష్టకృత్తుచే నొక యాహుతి వేయును. పిమ్మట హుతశేషమును నొకమంత్రముచే నభిమంత్రించి నొకమంత్రముచే దానిని ముమ్మారు ప్రాశనము చేయును. అనంతర మొకమంత్రముచే తన హృదయమునుతాకి యుదకమును స్పృశించును, తరువాత "నాభిరసి" అను మంత్రముచే నాభిప్రదేశమునుస్పృశించి "భద్రం కర్ణేభి" అను మంత్రముచే నామంత్రమందున్న యవయవములను తాకును. ఇక సూర్యోపస్థానము చేసి మహావ్యాహృత్యాదికముచే హోమమంత్రశేషమును పూర్తిగావించును.

౯

గోసంవర్ధనకర్మ:- గోవులరణ్యమునకేగునపుడొక మంత్రముచే వాని నను మంత్రించును. అవి గృహమునకు దిరిగివచ్చినపిమ్మట నొకమంత్రము జపించును. మరియొకమంత్రముచే గోష్ఠముప్రవేశించిన వాని నభిమంత్రించును.

౧౦

ఫల్గునీనక్షత్రయుక్త పౌర్ణమాసి యనంతర మమావాస్య రేవతీనక్షత్రముతో కూడినపుడు "భువనమసి" అను మంత్రముచే గోవుల కంకనము వేయుదురు. ప్రథమ ప్రసూతమైన గోవుపీయూషమునుగ్రహించి గార్హ్యాగ్నియందు లేపనాద్యాజ్యభాగా ంతముచేసి మహావ్యాహృతి చతుష్టయముతో నాల్గాజ్యాహుతులువేల్చి తంత్రశేష మును పూర్తిగావించవలయును. కవలుదూడలు పుట్టినచో మహావ్యాహృతులతోవేల్చి అట్టియావును దానమీయవలయును.

౧౧

వృషోత్సర్గము:- కార్తికపౌర్ణమాసియందుగాని యాశ్వయుజ మాసమున రేవతీనక్షత్రకాలమందుగాని వృషోత్సర్గము చేయుదురు. ఎవనికి గర్భగ్రహణ యోగ్యములగు పెయ్యదూడలు పండ్రెండుండునో వాడు వృషోత్సర్గము చేయుటకు నర్హుడు. గోవులమధ్య పూర్వోక్త శుభదినమున నగ్నిని ప్రజ్వలింపజేసి నాల్గుమంత్రములచే నాల్గాజ్యాహుతులు వేల్చును. పిమ్మట పూషనుద్దేశించి గ్రహణప్రోక్షణములుచేసిన పిష్టమయి స్థాలీపాకముచే సమంత్రకముగా నొక యాహుతివేసి రుద్రదేవతాకములైన నలువదిఋక్కులు జపించును. (కొందరీ రుద్రమంత్రగణమును యజుర్వేదమున గలనమకమందురు.) జపానంతరము "ఏతంయువానం పతింనోదదామి" అను మంత్రముచే నొక వృషభమును పెయ్యదూడలమధ్య విడుతురు. ఆవృషభము, ఏకవర్ణముగానీ, ద్వివర్ణముగాని, త్రివర్ణముగాని, యెఱ్ఱనిదిగాని కావచ్చును. లేదా స్మృతిప్రసిద్ధమైన నీలవృషభము కావచ్చును. మరియునది సర్వగోగణమునందును శ్రేష్ఠమైనది, సర్వాంగములతోఁ గూడినది, అది వెళ్ళుచుండగా గోగణముచే చుట్టును ననుసరింపఁబడునది, బలిష్ఠమైనదీ, దుర్లక్షణములులేనిది, తేజోవంతమైనది కావలయు. దీనిని విడచునపుడు ఘంటాచామరాదులతో నలంకరింపలయు. దీనితోఁగూడ యూధమందు ముఖ్యమైన నాల్గు పెయ్యదూడలనుగూడ నలంకరించునది. వదిలిన ఋషభము యూధము మధ్యనిలచియుండగా నొకఋక్కుచే నభిమంత్రించును. పిమ్మట స్విష్టకృత్తునువేల్చి సర్వగోక్షీరముతో పాయసమువండి దానిచే బ్రాహ్మణసంతర్పణ గావించునది.

౧౨

అష్టకాకర్మ:- మార్గశిరమాసమునకు పూర్వము కృష్ణపక్షమున మూడష్టకలు నిర్వర్తింపఁదగినవి. వానిలో ప్రథమాష్టకయందు, యగ్నియందుపలేపనాద్యాజ్య భాగాన్తముననొనరించి యొకమంత్రముతో శాకము నేకాహుతిగా వేల్చి తదనంతరము స్విష్టకృత్తుతో హోమముచేసి మరల శాకమును స్థాలీపాక ధర్మముతో వేల్చును. పిమ్మట స్విష్టకృత్తు వేల్చి మహావ్యాహృత్యాదికముతో తంత్రశేషము పూర్తిగావించును.

౧౩

మధ్యమాష్టకయందు, మాధ్యావర్షకర్మయందును తంత్రము సమానము. ఆషాఢపూర్ణిమ గడిచినయనంతర మెవరికి వర్షాకాలము ప్రవర్తిల్లునో వారికి శ్రావణపూర్ణిమతరువాత అష్టకాకర్మ చేయఁదగినది. ఆషాఢామావాస్య గడిచినపిమ్మట అనగా

శ్రావణమాస శుక్లపక్షమున వర్షాకాల మెవరికి ప్రవర్తిల్లునో వారికి భాద్రపదమాస కృష్ణపక్షమున అష్టకాకర్మ చేయఁదగినది.

అగ్నిని ప్రతిష్ఠించి యందు మహావ్యాహృతులతో నాల్గు, "యేతాతృషు" అను మంత్రములలో నాల్గు, కలిసి యెనిమిదాహుతులు పశువునుండి తీసిన వపతో హోమము చేయుదురు. లేదా "వపావపాంజాతవేదః" అను మంత్రముతో వపాహోమము కర్తవ్యము. పిమ్మట స్విష్టకృద్ధోమము చేసి తంత్రశేషమును పూర్తిగావింతురు. ఇట పశుకల్పోక్తవిధిగా పశువిశసనము చేయునది. ఇది పశుపక్షము. ఇక స్థాలీపాకపక్షమున స్థాలీపాకముపైనున్న మండమును గ్రహించి దానినే వపగాభావించి వపాహోమ మంత్రముతో హోమము చేయుదురు. తక్కిన తంత్రము సమానము.

వ్యభిచారమువలన పుట్టినవాడు అష్టక చేయువిధానము:- "అన్తర్హితా" అను మంత్రము మొదలు "యన్మేమాతా ప్రలులుభే" అను మంత్రమువరకున్న నాల్గుమంత్రములు పూర్వోక్తవిధిలోని మహావ్యాహృతి చతుష్టయమునకు బదులుగా చెప్పవలయు. ఆమంత్రములలో మంగళదేవీ పదస్థానమున తనతల్లిపేరు చెప్పనగు.

౧౪

మూఁడవదానియందు అపూపములను వేల్చును. అష్టకనుద్దేశించి గ్రహణ ప్రోక్షణాదికము చేసి పిండితో మూడు అపూపములనువండి సమంత్రకముగా చరుధర్మముతో హోమము చేయునది. పిమ్మట స్విష్టకృద్ధోమము చేసి తంత్రశేషమును పూరించునది. గోపశువుగాని స్థాలీపాకముగాని సంభవింపనిచో "ఏషామేష్టకా" అని ఒక బలీవర్దము నకుఁ గరిపోవు గడ్డిదానమివ్వవలయు. లేదా యరణ్యము కేగి గడ్డి తగులపెట్టనగు. మొత్తము మీద యష్టకారహితుఁడు మాత్రము కాగూడదు.

తృతీయాధ్యాయము సమాప్తము.

# చతుర్థాధ్యాయము

౧

ప్రతిమాసమున పితృదైవత్య కర్మ చేయునది. వేదవేత్తలగు బ్రాహ్మణులను, బేసిసంఖ్యగలిగి ముగ్గురికి తక్కువగాకుండునట్లు వరించి పితృపితామహ ప్రపితామహక్రమముగా నాసీనులంజేసి వారిముందుంచిన యుదకపాత్రములందు దిలలనుంజల్లి "అసావేతత్తే" అని వారి హస్తములందర్ఘ్యము నియ్యవలయు. పిమ్మట నగ్నౌకరణముచేసి "అసావేతత్తే" యని పలికి యన్నమును భుజింపంజేయవలయు. వారుభుజించుచుండగా, మహావ్యాహృతులను, సావిత్రిని, మధువాతీయములను, పితృదేవతాకములను, పవమానసూక్తములను జపించునది భుజించినపిమ్మట పిండదానము చేయవలయు. కొందరు హోమానంతరము పిండములనిడుదురు. పితృపిండములకు పశ్చిమభాగమున తత్పత్నులకు పిండములనుంచవలయు. కాని పితృపిండములకు మాతృపిండములకు మధ్య దర్భాదులచే నడ్డముం గల్పింపనగు. పిమ్మట బ్రాహ్మణులకు అన్నశేషమును నివేదించవలయు. అగ్నౌకరణాదికము పిండపితృ యజ్ఞోక్తవిధిగా నాచరించునది.

౨

ఏకోద్దిష్టము:- పితృమరణానంతరము పదునొకండవ దినమున నేకోద్దిష్టకర్మ చేయునగు. ఇందు ఆవాహనము, అగ్నౌకరణములేదు. ఒకపవిత్రము, ఒక అర్ఘ్యపాత్రము, పత్నీవర్జముగ నొకపిండము "స్వదితం" అని తృప్తిప్రశ్న "ఉపతిష్ఠతాం" అని అక్షయ్యస్థానమున పలుకవలయు. "అభిరమ్యతాం" అని విసర్జనము చేయునది. సంవత్సరము ముగియుచుండగా ప్రేత, పితృ, పితామహ, ప్రపితామహ పాత్రములలో ప్రేతపాత్రమును పితృపాత్రమునందు కలిపి ప్రపితామహపాత్రమును వదులునది. ఇట్లు పిండములందును కర్తవ్యము.

3

సపిండీకరణము:- సంవత్సరము పూర్ణమైనపిమ్మట నాల్గుదకపాత్రలను నిల్పి వానియందు తిలలు, గంధము, నుదకమునుంచి ప్రేతపాత్రమును పితృపాత్రమునందు పోయవలయు.

౪

ఆభ్యుదయిక శ్రాద్ధము:- శుక్లపక్షమున శుభదినమున పూర్వాహ్ణమందు వేదవేత్తలగు నిద్దరు బ్రాహ్మణులను గూర్చుండంబెట్టి యుపచారము ప్రదక్షిణముగా

నోనర్పవలయు. పైతృకమంత్రములను జపింపరాదు. తిన్ననైన దర్భలుగ్రహించునది. తిలలకుబదులు యవలుగ్రహించునది. పెరుగు, రేగుపండ్లు, అక్షతలు, వీనితో కలిపిన పిండములు. ఆవాహనవిషయమున నాందీముఖపితృదేవతలని యావాహనము చేయునది. [illegible]మునను నాందీముఖ పితృదేవతలను గ్రహించునది. తక్కినదంతయు పూర్వోక్తముగాగ్రాహ్యము.

౫

ఉపాకరణము:— ఓషధులుత్పన్నమగునపుడు హస్తనక్షత్రకాలమందు గాని శ్రవణనక్షత్రకాలమందుగాని సక్తువులు, అటుకులు, దధి, ఘృతములతోఁగలిపి ఋగ్వేదముచే ప్రతిఋక్కును స్వాహాకారంతముచేసి వేల్చునది. లేదా సూక్తములచేఁగాని, యనువాకములచేఁగాని హోమముచేయునది అధ్యాయార్షేయాదులతో వేల్చవలయునని మాండూకేయమతము. కౌషీతక్యాచార్యులుమాత్రము "అగ్నిమీళేపురోహితమ్" అని యారంభించి "తచ్ఛంయోరావృణీమహే" అనునంతవఱకు వేల్చవలయునని చెప్పుచున్నారు. హుతశేషమునుండి కొంతగ్రహించి యాచార్యుఁడు శిష్యుఁడు ప్రాశనము చేయుదురు, పిమ్మట నాచమింతురు. కూర్చుండి శిష్యుఁడు మహావ్యాహృతులను, సావిత్రిని, వేదము మున్నగువానిని స్వస్త్యయనసూక్తములనుజపించి యాచార్యునిచే స్వస్తి పలికించును. ఋషులు తమ తపోబలమువలన వేదసారముగను అయాతయామముగల దానినిగాను నుపాకర్మను పేర్కొనిరి. అందువలన షట్కర్మనిరతుఁడై తనకు మంత్రసిద్ధి కోరువాఁడు కర్మసిద్ధికొఱకుపాకరణము చేసికొనవలయునని పలికిరి. ఉపాకర్మయందు ఉత్సర్గమందు త్రిరాత్రము గడుపదగినది. అష్టకలయందు ఋత్వంతరాత్రులయందహోరాత్రము గడుపుట కర్తవ్యము.

౬

ఉత్సర్గకర్మ:— మాఘశుక్ల ప్రతిపత్తునందు గ్రామమునకు వెలుపల నీశాన్య దిగ్భాగమున నోషధీబాహుళ్యముగలప్రదేశమున ముప్పదియాఱుఋక్కులనాచార్యుఁడు జపించి, తూర్పుద్వారమునుండి ఐదుఋక్కులను పఠించుచు నాల్గుమట్టిగడ్డలను ప్రదక్షిణముగనుంచి వానిపై నైదవమట్టిగడ్డ నుంచవలయు. తదుపరియాచార్యుఁడు శిష్యసమేతుఁడై ఋషులకు, ఛందస్సులకు, దేవతలకు, తమతమ పితృపితామహ ప్రపితామహులకు తర్పణముచేసి అర్ధసప్తమమాసములుగాని యర్ధషష్ఠమాసములుగా నిత్యాధ్యయనమాచరింపక విడుచునది. అవశ్యముగాపఠింపనెంచినచో నహోరాత్రము మాత్రమాగిపఠించునది.

౭

అనధ్యాయములు:- ఉత్పాతములయందును, తదన్యములు నాశ్చర్యకరములగు వానియందు నేకాలమున నివి కలిగినవో మరునాడా కాలమువఱకును, మెఱుపులు, ఉరుములు, వర్షములు వచ్చినపుడు మూఁడుపూటలును, శ్రాద్ధభోజనమునందు ఒకపూటయును, సూతకములందు పదిదినములను, చతుర్దశి, అమావాస్యలందును, అష్టకలయందును, గురువుచనిపోయినపుడు పదిదినములును ఆచార్యుని పిత్రాదులు చనిపోయినచో మూఁడురాత్రులు, ప్రతిగ్రహము చేసినపుడు శ్రాద్ధములందువలెన నధ్యాయము. సజాతీయమైన ప్రేతమునసుసరించినపుడు, పితృదేవతలకు పిండనిర్వాపణము చేసినపుడు. నిశాసమయమున, సంధ్యాసమయమున, పర్వములందును, సూర్యుఁడస్తమించినపుడు, వినగూడనివారిసన్నిధిని, సామధ్వనిశ్రవణమునను, శ్మశానమునను, శవము గ్రామమధ్యమందున్నను, దుర్గంధము వ్యాపించునపుడు, పెనుగాలివీచునపుడు, నడివీధియందును, వీణాశబ్దమువినినపుడును, వృక్షారోహణమునను, నగ్నుడైనపుడు, ఎంగిలితో నున్నపుడు, కేశశ్మశ్రువపనానంతరముస్నానము చేయకుండగను, అభ్యంగస్నానము చేయుచుండగను, ప్రేతమును దాకినపుడు, బాలింతను, రజస్వలను తాకినపుడు, సేనయందును, గృహమునకేతెంచిన బ్రాహ్మణుఁడు భుజింపకపోయినను, ఆవులను దాటిపోవునపుడును, అధ్యయనము చేయఁగూడదు. అధ్యయనము చేయునపుడొకవేళ హఠాత్తుగా నుత్పాతముసంభవించినచో నపుడు ప్రాణాయామము చేసి సూర్యావలోకనముగావించి, యధ్యయనము పూర్తిగావించునది. అన్నము, ఉదకము, కందమూలఫలములు, శ్రద్ధగానిచ్చిన వస్తువు, వీనినిగ్రహించినచో నారుమాసములధ్యయనము చేయక గడుపవలయును.

౮

అధ్యాపనవిధి:- నీతివర్తనముగల శిష్యులతో నాచార్యుఁడుండవలయు. ఆచార్యుఁడు ప్రాఙ్ముఖుఁడై గాని యుదఙ్ముఖుఁడై గాని కూర్చుండనగు. ఆచార్యునిదగ్గర శిష్యుఁడుప్రాఙ్ముఖుఁడై గాని, యుదఙ్ముఖుఁడై గాని యాసీనుఁడుగావలయు. తక్కినశిష్యులు యథావకాశముగా నుపవిష్టులై యుండవచ్చు. శిష్యుఁడాచార్యుని చెంత నున్నతాసనమున గాని యాచార్యునియాసనమునగాని యధిష్ఠింపరాదు. కాళ్ళుజాపి కూర్చుండరాదు. చేతులతో మోకాళ్ళను పట్టుకొని యుండరాదు. మరియొకదానిపై తనశరీరమాధారపడియుండకూడదు. తనపాదములు తొడలపైనుంచికొని యుండఁజనదు. పాదప్రసారికను చేయఁకూడదు. ఆచార్యుఁడు "చదువుడని" హెచ్చరించి ఓంకారము నుచ్చరించును.

శిష్యులు ఓంకారము నుచ్చరించి పాఠమునకుపక్రమింపనగు. తరువాత వారు విరామము లేకుండ నధ్యయనము చేయవలయు. శిష్యుల ధ్యయనము సమాప్తి గావించి "విరతాస్మః" అని చెప్పవలయు. అధ్యయనము చేయుచున్న వారి మధ్యగా నాచార్యుఁడు వెళ్ళవచ్చును కాని యితర విద్యార్థులు గురువునకు తనకు మధ్యగా వెళ్ళగూడదు. పిల్లి మున్నగువని మధ్యగా వెళ్ళినచో త్రిరాత్రముగాని యహోరాత్రముగాని యుపవసించి సావిత్రిని జపింపవలయు. బ్రాహ్మణులకు దక్షిణ నొసగి ఒక యహోరాత్రము పాఠముమాని యధ్యయనము మరల ప్రారంభింపనగు.

౯

ఉదకతర్పణము:— అవగాహనస్నానమాచరించిన పిమ్మట యజ్ఞోపవీతియై దేవతాతర్పణము గావింపవలయు. ఈ దేవతలు అగ్ని, వాయువు, విష్ణువు నలుబది యేడుగురు కలరు.

౧౦

ప్రాచీనావీతియై దక్షిణదిశను నిరీక్షించుచున్నవాఁడై "శతర్చులు మాధ్యములు, గృత్స్నమదులు, మున్నగు నలువదియేడుగురు స్వాచార్యులకు తర్పణము, పితృతర్పణము గావించి పితృవంశ తర్పణము, మాతృవంశ తర్పణము చేయునది.

౧౧

మైథునేతర సమయములందు నగ్నస్వరూపిణియగు స్త్రీని జూడరాదు. ప్రాతస్సాయం సంధ్యలయందు సూర్యుని జూడరాదు. అస్పృదు కానివానిని, చేయరాని పనిని చేయువానిని, ప్రేతమును దాకిన వానిని జూడఁజనదు. ప్రసవించిన స్త్రీతోడను, రజస్వలయయిన స్త్రీతోడను మాటాడదగదు. మీగడ తీసినదానిని భుజింపఁజనదు. వండిన తరువాత జాముగడిచిన పదార్థములను సేవింపరాదు. మఱియొకరితో నేకభాజనమందు భుజింపఁదగదు. ఇతరులు భుజింపగా మిగిలినది భుజింపరాదు. పితృదేవతలు, అతిథులు, భృత్యులు, ఈముగ్వురి భుక్తశేషమును తినవచ్చును. ఉఞ్ఛశిలవృత్తులును, అయాచిత ప్రతిగ్రహము సాధువులనుండి యాచిత ప్రతిగ్రహము, యాగము చేయించుట, వృత్తులుగా స్వీకరింపఁదగినవి. వీనిలో పూర్వాపూర్వము శ్రేష్ఠము. వీనిచేత జీవనము జఱుగకున్న వైశ్యవృత్తి నవలంబించవచ్చు. పితృదైవత కార్యములందు ప్రమత్తుఁడు కాఁగూడదు. స్వభార్యాగమనము ఋతుసమయముననే చేయఁదగు. పగటియందు, రాత్రిలఁ దొలిజామున, తెల్లవారుజామున నిద్రింపరాదు. ఆచ్ఛాదింపని నేలపై కూర్చుండఁజనదు.

కమండలువు, యజ్ఞోపవీతము నిత్యము ధరింపఁదగినవి. అనుజ్ఞపొందక యాచార్యునివీడి యుండరాదు. అనుదినము నాచార్యునకభివాదనము సేయుచుండవలయు. గురువులకునిట్లే యాచరించునది. శ్రోత్రియునకు సమీపించినప్పుడును, అశ్రోత్రియునకైనను తాను గ్రామాంతరమేగి వచ్చినపుడభివాదనము చేయఁదగు. ఈయభివాదనమున తన నామ గోత్రములనుచెప్పి తనదక్షిణోత్తర హస్తములతో నాచార్యుని దక్షిణోత్తర పాదము లను పట్టుకొనునది. ఆచార్యుఁడు శిష్యునిచేతులను గ్రహించి యాశీర్వదించును. వర ణములేనిది యాగమునకేగరాదు. అధర్మమునందసహ్యాభావము కలిగియుండునది. జన సమూహమున చొరఁబడరాదు. కోపమును విడువవలయు. చాడీలుచెప్పరాదు. ఇఁటిం టికిఁ దిరుగఁజనదు. ఒంటరిగా సంచరింపకూడదు. దేవాయతనము మున్నగువానికి ప్రద క్షిణముగా నేగునది. పళ్ళుగిజుట, ఉమ్మివేయుట, గోకుకొనుట, పనికిరాదు. మూత్రపురీష ములను దర్శింపరాదు, భూమిపై తృణమునుంచి తానుముసుగుతోనుండి మూత్రపురీష ములను విడుచునది. మఱియు తానేకవస్త్రమును ధరించినయెడల యజ్ఞోపవీతమును చెవికితగిలించుకొననగు. సూర్యునకభిముఖముగాగాని వెన్నుజూపిగాని కూర్చుండరాదు. పగలు ఉత్తరాభిముఖముగాను, రాత్రిదక్షిణాభిముఖముగాను కూర్చుండజను. నీటియం దుమియరాదు. సమీపమునను నుమియగూడదు. చెట్లనెక్కగూడదు. భావిలో తొంగి చూడరాదు. అగ్నిని ప్రవేశింపజనదు. శ్మశానముత్రొక్కరాదు. అనుదినమును సవ స్త్రుఁడై స్నానము చేయవలయును. తీరముజేరి ధౌతవస్త్రమును ధరింపవలయు.

౧౨

కృషికర్మ:- వ్యవసాయపు పనులారంభించుటకు రోహిణీ నక్షత్రము మంచిది. ఆ పనులకుముందు భూమికితూర్పువైపున ద్యావాపృథివులకు, ద్యావాపృథివీను ఋక్కుతో బలినిడవలయును. తరువాత మరియొకమంత్రముతో నుపస్థానముం జెప్ప వలయు. తొలిసారిగా నాగలిగట్టునపుడు ఒక మంత్రముతో బ్రాహ్మణుఁడా నాగలిని స్పృశింపవలయు. మరియొకమంత్రముతో బ్రదక్షిణము చేయుచు ప్రతిదిక్కున నుపస్థా నము చెప్పవలయు.

౩౧

ఉదకతరణము:- నదులను దాటవలసి వచ్చునపుడు స్వస్తిసూక్తమునుచెప్పి ఏదిక్కునుండి యుదకము వచ్చుచున్నదో యాదిక్కునకు తిరిగి యొక మంత్రమును జపించి మరియొక మంత్రముతో మూఁడు దోసిళ్ళ నీటినెత్తి విడువవలయు. ఈ మంత్రి

ముతోనే నీటిని పైకిచిమ్మి దాటవలయు. దాటుచుండగా భయముదయించినచో వాసిష్ఠసూక్తమును జపించునది.

౧౪

శ్రావణీకర్మ:- శ్రావణ పూర్ణిమయందుపలేపనోల్లేఖనాద్యాఘారాజ్య భాగాంతములను చేసి యక్షతసక్తువులతోగాని, స్థాలీపాకము చేగాని విష్ణువునకు, శ్రావణ పూర్ణిమకు, సర్పమునకు స్వాహాకారాన్తముగా మూండాహుతులు వేల్చి మహావ్యాహృతి సర్వప్రాయశ్చిత్తాది తంత్రశేషమును పూర్తిగావింపవలెను.

సర్వవత్యుపకర్మ:- ఈ పూర్ణిమయందే గృహ్యాగ్నిని వెలుపల నుత్తరముగా నుంచి యక్షత సక్తువులను, పేలాలను నేతిలో తడిపి హోమమును చేయువలయు. ఈ హోమము దివిలోకమందుండు సర్పముల యధిపతికిని, సర్పములకు. అంతరిక్షమందలి సర్పములకును, పృధివియందలి సర్పముల యధిపతికిని, సర్పములకు జేయువలయు. అగ్నికి నుత్తరభాగమున ప్రాగగ్రములగు కుశలమీద యుదకుంభమునుంచి వరుసగా నుదక దానమును జెప్పవలయు. ఈ రీతిగా కంకతవేష్టనము వర్ణక ప్రలింపనము పుష్పప్రకిరణము, సూత్రతంతుప్రక్షేపణము అంజనము ఆదర్శేక్షణము, బలిదానము, యీ యొనిమిదింటిని క్రమముగా నీయవలయు. తరువాత స్విష్టకృత్తు, మహావ్యాహృతులు సర్వప్రాయశ్చిత్తములతో తంత్రశేషమును పూర్తిగావింపవలయు. మార్గశిర శుక్ల చతుర్దశివరకిట్లు సర్పకర్మచేయుచో నీనాల్గు మాసములు మంచమునందే శయనించవలయు.

౧౫

ఆశ్వయుజకర్మ:- ఆశ్వయుజ పూర్ణిమయందుపలేపనాద్యాజ్య భాగాన్తము చేసి పాయసచరువును, ఇంద్రునకు, అశ్వినులకు, అశ్వయుక్కులకు, ఆశ్వయుజపూర్ణిమకు, అశ్వపతికి పింగలునకు స్వాహాకారాన్తముగా నాల్గాహుతులు వేల్చునది. తరువాత క్షీరఘృతములను కలిపి యెనిమిది ఋక్కులతో నెనిమిది యాహుతులను స్రువముతో వేల్చి స్విష్టకృదాది తంత్రశేషమును పూర్తిగావించునది. పిదప బ్రాహ్మణ భోజనము కర్తవ్యము. దూడలతో గూడిన గోవులు నారాత్రి హోమప్రదేశమున పరుండబెట్టవలయు.

౧౬

ఆగ్రహాయణీకర్మ:- మార్గశీర్ష పూర్ణిమయందు సర్వవత్యుపాకర్మ చేసిన వారే యుపాకర్మ కుత్సర్గము చెప్పి యొక మంత్రముతో గృహమధ్యమున మోదుగ